సాధన గ్రంథమండలి 44.

# హిందూకోడ్ బిల్ సమీక్ష

## ప్రథమ భాగము

కర్త:

శ్రీ ౧౦౮ శ్రీ కరపాత్రీ స్వామి

అనువాదము:

బులుసు ఉదయ భాస్కరము



సాధన గ్రంథమండలి, తెనాలి

 [ వెల రు. 1-0-0



పూజ్యపాద శ్రీ ౧౦౦౮ కరపాత్రీజీ స్వామి

శ్రీరామ జయ రామ జయ జయ రామ

ధర్మస్య జయోఽస్తు

అధర్మస్య నాశోఽస్తు

ప్రాణిషు సద్భావనాఽస్తు

విశ్వస్య కల్యాణ మస్తు

హర హర మహా దేవ

శ్రీహరిః

పూజ్యశ్రీ ౧౦౦౮ స్వామి శ్రీ కరపాత్రీజీ మహారాజువారి

ఆశీస్సులు

## నారాయణస్మరణము

హిందూకోడ్ బిల్ దేశములోని సమస్తప్రాంతముల హిందూమతము మీద హస్తాక్షేపము చేయునదై యున్నది. కావున హిందువు లందఱును దానియొక్క ఘాతకప్రభావమునుగూర్చి బాగుగా తెలిసికొనుట అత్యావశ్యకమై యున్నది. భారతదేశములో వాస్తవిక బహుమతము (Majority) ధార్మిక ఆస్తిక హిందువులదే యైనను దానిలో ప్రచారలోప మగుటచే జాగృతి చాల తక్కువగా నున్నది. ఆ కారణమున ప్రభుత్వము మతముమీద సవారి చేయుట కవకాశము కలుగుచున్నది. హిందూకోడ్ బిల్ ప్రమాణము విషయములో శ్రీ బులుసు ఉదయభాస్కరముగారు తెలుగున ననువాదము కావించిరి. దీని మూలమున తెలుగు మాటలాడువా రందఱు ఆబిల్లుయొక్క సమస్త ఘాతుకములను బాగుగా తెలిసికొని తమ కర్తవ్యమును నిర్ధారించుకొనగలుగుదురు. వస్తుతః ఇట్టి పుస్తకముల యనువాదము భారతదేశములోని సమస్త భాషలలో నవసరమగుచున్నది. భాస్కరముగారొక ప్రాంతములోనిలోపమును బూర్తిగావించినారు.

మకాం: బొంబాయి
5-8-1951

(సం.) కరపాత్రిస్వామి

శ్రీ

# ధర్మో రక్షతి

ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం
యః శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

"రామో విగ్రహవాన్ ధర్మః" రాముడు రూపొందిన ధర్మము. లోకములో ధర్మప్రతిష్ఠాపనము జేయుటకే శ్రీ మహావిష్ణువు, శ్రీరామచంద్రమూర్తిగా అవతరించినాడు. ఆనాడు దుష్ప్రవృత్తుల కధిపతియైన రావణాసురుడు, సాక్షాత్తు శ్రీరామచంద్రుని ధర్మరక్షిరూపిణి యగు ధర్మపత్నిని, సీతాదేవిని అపహరించి, లోకముల కుపద్రవములను గొనివచ్చినాడు. రుద్రాంశమున ఆంజనేయుడు లోకములో అవతరించి, శ్రీరామచంద్రుని నమ్మిన దూతయై, సీతజాడలు ప్రభువున కెఱిగించి, రావణవధోద్యోగమున శ్రీరామచంద్రునకు చేదోడుగానిలిచి, శ్రీరామచంద్రుని పరమార్థసిద్ధికి మూలకందమైనాడు.

ఈనాడు మరల లోకములో ధర్మము తారుమారు అగు గతి పట్టినది. దానిని మరల సక్రమముగ నుద్ధరింపవలసిన ఆవశ్యకత యేర్పడినది. అందుకు రామరాజ్యపరిషన్ముఖమున శ్రీ ౧౦౦౮ శ్రీకరపాత్రీజీ స్వామివారు నడుముకట్టినారు. శ్రీస్వామివారి ఆదేశము ననుసరించి, ఉత్సాహపూరితులు. సమర్థులు అగు పలువురు మహాశయులు, రామదూతలుగా శ్రీస్వామివారి కార్యక్రమమున సన్నద్ధులై నిలిచి యున్నారు.

అట్టివారిలో శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారొకరు. శ్రీపంతులుగారు ధనవంతులైనందున సార్థకముగా ఎన్నో దానములు చేసియున్నారు. వీరి ఔదార్యము లోకములో నలుమూలల గంధవహమువలె అమోఘ యశః పరిమళముతో వ్యాపించుచున్నది. శ్రీ కరపాత్రీజీవారి సత్సంకల్పఫలమైన ధర్మప్రతిష్ఠాపనకు మూలసంస్థ యగు రామరాజ్యపరిషత్తు శ్రీ ఈదర వేంకటరావుపంతులుగారి మహారథిత్వమున మనోరథపార మధిగమింపనున్నది.

శ్రీ కరపాత్రీజీ స్వామివారిచే సువిపులముగ చర్చింపబడి గ్రంథరూపమున ప్రకటింపబడిన 'హిందూకోడ్ బిల్ సమీక్ష' ఆంధ్రలోకములో నెల్లెడ పుష్కలప్రచారము గావించుటకు శ్రీ స్వామివారి నారాయణస్మరణానుగ్రహ పూర్వకమైన అనుమతి అయినది. అందులకు రామరాజ్యపరిషద్ధురంధరులగు శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారు తమ సహజౌదార్యమునకు, ధర్మనిరతికి నిదర్శనముగా అన్నివిధముల చేయూతనిచ్చి తెలుగున ఈ "హిందూకోడ్ బిల్ సమీక్ష" పుస్తకరూపమున వెలువడుటకు మా సాధన గ్రంథమండలికి ఎంతయు సాయమొనరించిరి.

ధర్మదూత యగు శ్రీ ఈదర వేంకట్రావు పంతులు గారికి ధర్మదేవత యగు శ్రీరామచంద్ర ప్రభువు ఇతోధిక ధర్మాభిరతిని, విభవములను, వంశాభివృద్ధిగ నొసగును గాక!

ఇట్లు

తెనాలి
ఖర శ్రావణము



బులుసు సూర్యప్రకాశశాస్త్రి
సంపాదకుడు
సాధన గ్రంథమండలి.

శ్రీ హరిః

# హిందూకోడ్ బిల్ సమీక్ష

## సింహావలోకనము

### సనాతనవిధానము

హిందువులు తమ విధానము సనాతనమైనదని విశ్వసింతురు. వారికొఱకై నవీనవిధానముల యొక్క అయేమియును లేదు. ఈజగత్తు జడపరమాణువులవలనను, విద్యుత్కణముల వలనను సృజింపబడినది కాదు. కేవల జడప్రకృతివలన నిర్మింపబడలేదు. రైలుబండి, తంతి, రేడియో, టాంకు. ఫిరంగు, యంత్రబద్ధమగు తుపాకి, వాయుయానము, యాటంబాంబు మున్నగువాని నిర్మాణమునకు చేతనమానుజుని విశేష బుద్ధిబలము కారణమని మనమంగీకరించుచున్నాము. అట్టియెడ నాకాశము, వాయువు, సూర్య చంద్ర నక్షత్ర సముదాయము పర్వత సముద్రాదులు. శుక పిక హంస మయూరాది పక్షినివహము, వన లతా పుష్పగుచ్ఛ ఫలాదికము మొదలగువాని తోడ విలసిల్లు నీసమస్త భూవలయము, మనుష్యుడు, వాని మస్తిష్క బుద్ధి శరీరేంద్రియాదికము మొదలుగాగల వివిధ విచిత్రతాభూయిష్ఠంబగు విశాలప్రపంచమును రచించునాతడు కూడ యెవ్వడో సర్వజ్ఞచేతనుఁడవశ్యముగ నుండితీరవలయునుగదా! చేతను డెవండైనను బుద్ధిపూర్వకముగనే కార్య

నిర్మాణము జేసుకొనును. కుమ్మరిని జూడుడు! అతఁడు మున్ముందు దండచక్రాటకములు సంపాదించుకొని జ్ఞానపూర్వకముగనే కుంభనిర్మాణము చేయుచుండును. అట్లే యీశ్వరుడు కూడ సర్వజ్ఞానమును మున్ముందు సమకూర్చుకొనియే సమస్త ప్రపంచమును సృజించుచున్నాఁడు. ఆతని సర్వజ్ఞానమందు సూక్ష్మశబ్దానువేధము కలదను విషయము వఱకును సమ్మతము. “న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే” (వాక్యపదీయే) అనగా పరిచితభాషయొక్క సూక్ష్మశబ్దములు చేరని ప్రత్యయము. జ్ఞానము సంకల్పము, విచారము వేఱొకటి లేదు. ఈ దృష్టిచేత యీశ్వరసృష్టికి గారణభూతమగు విజ్ఞానమందుగూడ నొక కొంత సూక్ష్మశబ్దానుభేదము తప్పక నుండి యుండును. ఆశబ్దములే వేదములు. ఆవేదములే యాభగవంతుని విధానములు.

ప్రపంచమందు గ్రీకు, లాటిను, జైందు, సంస్కృతము నాదిగాగల భాషలే యత్యంత ప్రాచీనభాషలు. ఈభాషలు పరస్పరమందు అప్పచెల్లెండ్ర వంటివనియు, వీటి కొక మాతృభాష తప్పక నుండియుండు ననియు, చెప్పబడుచున్నది. కాని యాభాష లభ్యము కాదు. ఒకానొక నాడీభాషను మాటలాడు జనులందఱు నొక్కచోట నుండియుండురనియు, వారందఱు నొకే భాషను మాటలాడువా రనియు, వారి యాభాష యెట్టిదో తెలియజాల దనియు జను లాభాషలయందలి విలక్షణసామ్యమును జూచి యూహించుచున్నారు. దేశవిషయమున గూడ మతభేద మున్నది. పశ్చిమోత్తర ఆసియా,

ఉత్తరధ్రువము ఈ దేశములలో నాభాష వాడబడియుండునని యూహింపబడు చున్నది. అప్పటి జనసంఘ మొకదాని కొకటి దూరమైనకొలది వారిలో భేదము బయల్వెడల నారంభించెను. కాని కొంత యోరిమి వహించి విచారణ చేయుగా మనమిపు డంతరించి పోయియుండు ననుకొన్న యాభాష సంస్కృతభాషయే యని వ్యక్తమగును. ఇది యన్యభాషలకు సోదరి యనిచెప్పుటకంటె మాతయని చెప్పుటయే యుచితము. ఈ భాషయొక్క విశాలప్రకృతి, ప్రత్యయములు, నుపసర్గలు, అక్షయశబ్దకోశము, నిరుపమాన వ్యాకరణము, సాహిత్యము అన్నియు బ్రపంచమునకు నిధులు. దీనిశక్తి నిస్సీమము. దీనికి కూడ పూర్వమం దొకభాష కలదనుటకు బ్రమాణ మేమియు గన్పడుట లేదు. నేటిచరిత్రకారులుకూడ ఋగ్వేదము బ్రపంచమం దత్యంత ప్రాచీనగ్రంథమని యంగీకరించుచున్నారు. అది 5 వేల సంవత్సరములకు పూర్వమందలిదని యూహింపబడుచున్నది. మోహింజోదరోయొక్కయు, హారప్పయొక్కయు బరిశీలన ఫలముగా లభించిన వస్తువులనుబట్టి జనులావస్తువుల కాలము నాటిసభ్యత సుమారు పదిహేను వేల సంవత్సరములకుపూర్వ ముండెననికూడ యూహింపదొడగిరి. అప్పటి శిల్పములను, చిత్రముల రంగులను, పాత్రలను, కుండములను, యజ్ఞపాత్రలను, అన్యవస్తువులను బట్టి యవి వైదికకాలీనసభ్యతకు చెందినవని తెలియుచున్నది. కొందఱవి సుమేరియను సభ్యతకు జెందినవని భావింతురు. కొంద ఱా సుమేరియను సభ్యతకూడ వైదిక సభ్యతమీద నాధారిత

మైనదని భావింతురు. ఏమయినను, అధునిక పాశ్చాత్య సభ్యతమీద నడచు జనులందరు ప్రపంచమంతయు 5 వేల సంవత్సరములకు పూర్వము ప్రాదుర్భవించిన దనియు, ప్రాచీన చరిత్రకాలము, నవీనచరిత్రకాలము నందలివే యనియు భావించుచున్నపుడు వైదికసభ్యత పదిహేనువేల సంవత్సరములకు బూర్వమందలిదని ఋజువు చేయబడినదంటే తక్కువ యానందించదగిన విషయము కాదు. వాస్తవమం దాధునిక వైజ్ఞానికలోకము లక్షలాది, కోట్లాది యబ్దములకు బూర్వమందలి దీయావద్భూమండలమని భావింపదొడగిరి. "మొదట సూర్యమండల ముండెడిది. దానినుండి యొక ఖండము ఛిన్నమై క్రిందబడి చల్లబడుచు, బడుచుః జంద్రమండల మైనది. రెండవ ఖండము విరిగిపడి భూమండల మయినది. అందు యావిరి, మేఘము, వర్షము, వనస్పతి, జంతుగణము. వానరనివహము, మానవసముదాయము క్రమికవికాసమును బొందుచు వచ్చెను. ఇంకను బొందుచు నుండును. వికాసవాదులు చెప్పు నీయుక్తిని బట్టికూడ సూర్యమండల మెట్లు నిర్మింపబడెను? ఎప్పుడు నిర్మింపబడెను? దాని యాయువెంత? యను ప్రశ్నలు ప్రశ్నలవలెనే యుండిపోవు చున్నవి.

నవీనవికాసవాదు లిపుడు ప్రకృతిని గుఱించికూడ కల్పన జేయగలిగిరి. కాని వైదికులది వారికంటెను చాల పూర్వమునాటిదని నిర్ణయింతురు. వారి సిద్ధాంతమును బట్టి ప్రతికార్య నిర్మాణమందును ప్రకాశము, నాందోళనము,

నిలుపుదల తప్పక సంభవించును. ఇంతు ఏయొకటి లోపించి నను కార్యము సంపన్నము కానేరదు. కేవల మాందోళనమే సాగుచుండి యెట్టినిలుపుదల లేకున్న యేచిత్రమును,వస్తువును నిర్మితము కాజాలదు. ఒకయెడ నాందోళనము, వేఱొకయెడ నిలుపుదలయు నున్ననాడె కార్యసిద్ధి కలుగును. ఆప్రకాశమే సత్త్వము, ఆ యాందోళనమే రజోగుణము, ఆ నిలుపుదలయే తమోగుణము ననంబడును. ఈ మూడు గుణములయొక్క సమానస్థితియే ప్రకృతియు, విషమస్థితియే వికృతియు నన బడును. ప్రకృతియందు సామ్యవైషమ్యములు స్వయముగా నుదయించునవికావు. అవి చేతనుని జ్ఞప్తిని, ఇచ్ఛనుబట్టి సంభ వించును. "జానాతి, ఇచ్ఛతి, అథకరోతి" యని సిద్ధాంతము. జ్ఞానేచ్ఛల యనంతరముననే కార్యము జరుగును కనుక సర్వజ్ఞుడు, సర్వశక్తిసమేతుడు నగు భగవంతుని జ్ఞానేచ్ఛల వలననే యాతని ప్రేరణలేక కృతిచేతనే ప్రకృతియందు వైషమ్యసామ్యములు సంభవించును. సమస్తమును దనలో నిముడ్చుకొని, ఒకేపదార్థమందు సమాప్తి జెందకుండయుండు నదియే పరమకారణము మఱియు బరమాధిష్ఠానమును. మృత్తికావికారములగు ఘటశరావాదులందు మృత్తికయే యుపలభ్యమగును. అది యొకే పదార్థమందు సమాప్తి జెందదు.కాని యామృత్తికయందే ఘటశరావాదిక మంతర్గత మగును. సత్త్వ రజస్తమములు చాంచల్యావష్టంభములు నన్నిటియందును సత్తాస్ఫూర్తులు గలవు. సత్తాస్ఫూర్తులు లేనియెడ నన్నియు నిస్సత్త్వములు, నిస్ఫూర్తికములు

నయిపోవును. ఎందును సిద్ధికలుగనేరదు. కావున సత్తాస్ఫూర్తి యన్నిటి యందును గలదు. సత్తాస్ఫూర్తులయందే సర్వము నిమిడియున్నది. అదియే సర్వాధిష్ఠానము, సర్వకారణము, సర్వప్రకాశకమును ఉపాదాన నిమిత్తములు కూడనదియె. కావుననే వేదాంతమందు అభిన్నోపాదాన నిమిత్తకారణత్వము సిద్ధాంతీకరింప బడినది.

అట్టి కారణభూత సత్తాస్ఫూర్తిరూపుడు, సచ్చిదానంద ఘనస్వరూపుడునగు బరమేశ్వరుని సృష్టికి మూలభూతమైన జ్ఞానమం దనువిద్ధములగు శబ్దములే వైదికశబ్దములు. ఇట్టి స్థితి యందు సృష్టియంతయు నయిదారువేల యబ్దములకు బూర్వ మందలిదని భావించుట పట్టిభ్రమ యని సిద్ధమగుచున్నది. బీజమునకు పూర్వ మంకురము, నంకురమునకు బూర్వము బీజమునని భావించబడుచున్నట్లే మఱియు బీజాంకురపరంపర యనాదియని యూహింపబడుచున్నటులే నిద్రకు బూర్వము జాగరణము, జాగరణమునకు బూర్వము నిద్ర యనియు, జన్మకు బూర్వము మరణము, మరణమునకు బూర్వము జన్మము ననియు, సృష్టికి బూర్వము ప్రలయము, ప్రలయమునకు బూర్వము సృష్టియనియు భావించవలసి వచ్చుచున్నది. కర్మకు ముందు జన్మ, జన్మకుముందు కర్మయని యూహింపవలసివచ్చుచున్నది. కర్మ రూపకారణ వైచిత్ర్యము లేనిచో జన్మ రూపకారణ వైచిత్ర్యము సిద్ధింపజాలదు. ఈవిధముగా నిద్రాజాగరణ, జన్మమరణ, సృష్టిప్రలయ, జన్మకర్మాదికమంతయు ననాదియని యంగీకరింపవలసి వచ్చుచున్నది.

పిమ్మట ననాది ప్రపంచమున కనాదిసృష్టికర్తయగు బరమేశ్వరుడు నాదిలేనివాడే యనియు, నాతనివిజ్ఞానము. నావిజ్ఞానముతోడ ననువిద్ధములైయున్న శబ్దములగు వేదములు గూడ నాదిలేనివే యనియు సిద్ధమగు చున్నది.

వేదములను 5 వేల సంవత్సరములకు బూర్వమందలివని నిర్ణయింప బూనుకొనువారు అవలంబించు సిద్ధాంతమేమి యనగా — "ఏదేని ఘటన జరుగకముందు వ్రాయబడదు. ఒక విషయము జరుగక ముందుగ నా విషయము, నొక వ్యక్తి జన్మించకముందు ఆ వ్యక్తియొక్క నామధేయము వ్రాయబడనేరదు. ఏదేని గ్రంథమందు హిట్లరుయొక్క నామమును జూచినవాడు ఆ గ్రంథము హిట్లరు జన్మించిన తరువాతనే వ్రాయబడిన దనుకొనును. కాని పూర్వమందు వ్రాయబడినదని యనుకొనడు. ఇట్లే వేదములందు గాననగు వేరు వేరు ఘటనలు, రాజులు, నగర, నదీ, పర్వత ధాన్యాదులు, జంతుగణము మున్నగువాని వర్ణనలను బట్టి యా విషయము లన్నియు జరిగిన పిమ్మటనే యా గ్రంథములు రచించబడి యుండును. ఈ దృష్టిచేత నాయా ఘటనల కాలనిర్ణయమునుబట్టి వేదములకాలముకూడ నిర్ణయింపబడగలదు." కాని వేదముల విషయమున బూననగు ధారణ యిందుకు బూర్తిగా వ్యతిరిక్తమైనది. అనగా నిందు ఘటనలను బట్టి యాఖ్యానములు గాని, యితిహాసములుగాని వ్రాయబడవు. ఇతిహాసమును బట్టియే ఘటనలు జరుగుటయు వ్యక్తులుదయించుటయు, సంభవించును. అన్యభాషలన్నియు

నాలుగయిదు వేల యబ్దములకు బూర్వమందలివని నిశ్చయించబడినవి నా భాషల శబ్దములు ఈశ్వరసంబంధమగు ననాది విజ్ఞానమందెట్లు సహజావిష్టములై యుండును? కావున సంస్కృతభాషకు జెందిన వైదికశబ్దములే యీ విజ్ఞానమందు సమకూర్చబడినవని భావించుట యుక్తియుక్తము. ఈ విధముగా సమస్త విశ్వము నీశ్వరకృతిమై, యీశ్వరవిజ్ఞానముతోడను, యీశ్వరేచ్ఛతోడను, యీశ్వరకృతితోడను సంపన్నమైయుండ, నా విశ్వమునకు బూర్వమందు ఈశ్వరకృతియు, నా కృతికి బూర్వమున నీశ్వరేచ్ఛయు, నాయిచ్ఛకు ముందు యీశ్వరజ్ఞానము, నాజ్ఞానమం దనువిద్ధములగు శబ్దములు నున్నటులే. ఆ శబ్దములే వైదికశబ్దములైన నీ సృష్టి శబ్దపూర్వకమైన దన్నమాట. శబ్దానువిద్ధములగు జ్ఞానేచ్ఛాకృతులతోడ నీశ్వరుడు ప్రపంచనిర్మాణము సేయును. దీనిని బట్టి శబ్ద మర్థపూర్వకము కాదనియు, నర్థమే శబ్దపూర్వకమనియు స్పష్టమగు చున్నది. ఇట్లే ఘటన జరిగిన తరువాత నాఖ్యానము కాదనియు, నాఖ్యానానంతరమే ఘటనయనియు గూడ సువ్యక్తమగు చున్నది. కుంభకారుడు తన మనమున కుంభశబ్దమును భావించి, కుంభజ్ఞానమును కలుగజేసుకొని కుంభనిర్మాణము జేయుచున్నటులే, ఈశ్వరుడుకూడ వేదశబ్దముల మూలమున విశ్వజ్ఞానమును గలుగజేసుకొనియే సమస్త విశ్వనిర్మాణమును జేయును. మనువుకూడ నుడివియుండెను. — "వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే" అనగా బరమేశ్వరుడు వేదశబ్దములచేతనే విశ్వనిర్మాణము సేయును.

ఈ విషయమే బ్రహ్మసూత్రములందుగూడ పేర్కొన బడినది. —"శబ్ద ఇతిచేన్నాతః ప్రభవాత్ ప్రత్యక్షానుమానాభ్యామ్" అనగా వేదములందు వర్ణింపబడిన వ్యక్తుల ననిత్యులగా భావించినయెడల వారిని ప్రతిపాదించు వైదికశబ్దములు కూడ ననిత్యములని భావింప బడగలవు. వేదములం దనిత్యత్వ మారోపింప బడకూడదు. కారణమేమియనగా, వేదముల మూలముననే వ్యక్తుల సృష్టి జరుగు చున్నదను విషయము ప్రత్యక్షముచేతను అనుమానము (శ్రుతిస్మృతులు) చేతను రూఢమగుచున్నది. పరమేశ్వరుడు 'ఏత' శబ్దముచేత దేవత లను 'అసృగమ్' శబ్దముచేత మానవులను, 'ఇందవః' శబ్ద ముచేత పితృదేవులను, 'తిరః పవిత్రమ్' శబ్దముచేత గ్రహము లను 'భూః' శబ్దముచేత పృథివిని నిర్మించెను. — "స భూరితి వ్యాహరన్ స భూమిమసృజత, ఏత ఇతివై ప్రజాపతిర్దేవాన సృజతాసృగమితి మనుష్యానిందవ ఇతి పితౄంస్తిరః పవిత్ర మితి గ్రహానాశవ ఇతిస్తోత్ర విశ్వానీతి శస్త్రమభిసౌభగే త్యన్యాః ప్రజాః" ఇవ్విధముగ సృష్టి జ్ఞానపూర్వకముగను, శబ్దపూర్వకముగను జరుగును.

లోకమందు వస్తూత్పత్తి యనంతరమున నామకరణ మను విషయ మనిత్య శబ్దార్థములయెడనే చరితార్థమగునని చెప్పవచ్చును. 'గో' ఆదిగాగల శబ్దము లెన్నియేని కలవు. వాటిని నిర్మించిన వ్యక్తి కానరాదు. వాటిని నిత్యములనియే భావించవలయును. శబ్దార్థసంకేత మొనర్చు నాతఁడుకూడ యీసంకేతముకొఱకే ఏవియో కొన్ని శబ్దముల నాశ్రయింప

వలసియే యుండును. ఈశ్వరుడుకూడ వేదో శబ్దముల ద్వారా శబ్దార్థసంబంధమును నిరూపించునో యా శబ్దములను ముందుగనే యంగీకరించవలసి యుండును. అంగ ప్రత్యంగ సంకేతములతోడ ననంతశబ్దములకు, నర్థములకు సంబంధము నూహించుట యసంభవమే. ఈశ్వరవిజ్ఞానము ననుసరించియు, తదనువిద్ధశబ్దముల ననుసరించియునే విశ్వసృష్టి జరుగుచున్నది. ఇదియే మూలస్థితి. కావున వ్యక్తులను, ఆఖ్యానములను గనుగొన్నంత మాత్రమున వేదకాల నిర్ణయము కాజాలదు. యోగి యైనవాడు ఋతంభరాప్రజ్ఞద్వారా భూత భవిష్యద్వర్తమానములను దెలిసుకొనగలడు. వాల్మీకి మహర్షి యటవియందుండి ఋతంభరాప్రజ్ఞద్వారా స్థూల సూక్ష్మంబులు, సన్నికృష్టవిప్రకృష్టంబులు నగు ఘటనలను ప్రత్యక్షముగ గనుగొని రామాయణమును రచించగలిగి నప్పుడు పరమేశ్వరీయ విజ్ఞానమగు వేదమందు సంపూర్ణవస్తు బోధమున్నదనుటయం దాశ్చర్యమేమియున్నది?

శ్లో॥ " చాతుర్వర్ణ్యం త్రయోలోకాశ్చత్వార శ్చాశ్రమాః పృథక్।
భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి॥
శబ్దః స్పర్శశ్చ రూపంచ రసో గంధశ్చ పంచమః।
వేదాదేవ ప్రసూయన్తే ప్రసూతిర్గుణ కర్మతః॥"

(మను - 12 - 97, 98)

'అత ఏవచ నిత్యత్వమ్' ( బ్ర. సూ. ) 'అనాదినిధనానిత్యాః' ఆదివచనములచేత వేదములు నిత్యములని సిద్ధమగుచున్నది.

ఏచేని చిన్న రాష్ట్రముయొక్క శాసనమునకుఁగూడ నొక విధానమపేక్షితమైయుండగా నిక ననంత బ్రహ్మాండాత్మక జగత్తుయొక్క శాసననొక విధానము లేనిదే యెట్లుపొసగును? ఒక యంగుళపు భూమి, యొక ప్రకాశము, నొక వృక్షము, నుద్యానకూప సరోవరాదికము గూడ నొక శాసకుడు లేక ప్రభువు లేకుండ యుండవుగదా! అట్టియెడ సూర్యచంద్ర నక్షత్ర వన పర్వత సాగరాదికము బ్రహ్మాండము నొకశాసకుడు లేనిదే యెట్లు నడువగలవు? ఈదృష్టిచేత నిందుకుగూడ తప్పక నొక విధానముండి తీరవలయును. తాత్కాలికులగు నియామకునకు, నియమింపబడువానికి నొక తాత్కాలిక విధానమెటులుండునో యట్లే సనాతననియామకునకు, నియమ్యునకు మధ్యనుండు విధానముగూడ సనాతనమే అయి యుండవలయును. అందుచేతనే వేదరూపవిధానముకూడ సనాతనమని చెప్పబడినది. ఈశ్వరీయ సనాతనవిజ్ఞానమం దనువిద్ధము లగుటచేతను ఈశ్వరీయనిశ్వసితము లగుటచేతను గూడ నవి సనాతనములే నిశ్శ్వాస మెట్లుగ జీవితదశను సూచించునో యట్లే వేదములు పరమేశ్వరస్థితి (సత్తా)ని సూచించును. ప్రాణి జీవించియున్నంత వరకాతని శ్వాసలు నడచుచునే యుండును. ఇట్లే పరమేశ్వరుఁ డున్నంతవరకు వేదములు నుండును. ఈశ్వరుఁడు సనాతనుడు కావున నాతని శ్వాసలుకూడ సనాతనములే. నిశ్వాసములయిన కారణము చేతగూడ వేదము లకృత్రిమములని రూఢమగుచున్నది. నిద్రయందు, జాగరణమందు నన్నివేళల శ్వాస నడచుచునే

యుండును. అది బుద్ధిప్రయత్నసాపేక్షము కాదు. కావుననే యకృత్రిమము. నపౌరుషేయము ననబడినది. కేవల జీవుడే కాదు. ఈశ్వరుని బుద్ధిప్రయత్నములుకూడ వేదనిర్మాణమం దపేక్షింపబడవు. ఈశ్వరబుద్ధిప్రయత్న నిరపేక్షములు. నకృత్రిమములు, పురుషులవలన గలుగు భ్రమప్రమాద విప్రలిప్సా కరుణాపాటవాది దోషములచే స్పృశింపబడ నేరనివి నగుటచేత వేదములు స్వతంత్రరూపమునఁ బరమప్రమాణములు. వాస్తవమున కదియే విశ్వవిధానము. నేడుకూడ భారతీయులలో జాలభాగ మావిధానమునే మన్నింతురు. సారాంశమేమి యనగా సనాతనపరమాత్మ సనాతనజీవాత్మలను సనాతనాభ్యుదయపరమపదముల బొందింప తన నిశ్శ్వాసభూతములగు నిత్యజ్ఞానానువిద్ధములగు సనాతనవేదములద్వారా నిశ్చయించిన సనాతనమార్గమే హిందువుల సనాతనవైదికధర్మము. "సనాతనస్త్వం పురుషో మతో మే" "జీవభూతస్సనాతనః" "ఛందాంసి యస్యపర్ణాని" "అశ్వత్థం ప్రాహురవ్యయమ్" "త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా" యున్నగు గీతావచనములను బట్టికూడ పరమేశ్వరుడు, జీవుడు, వేదములు, ధర్మము ఇవన్నియు సనాతనములని సిద్ధమగుచున్నది.

హిందూధర్మశాస్త్రములద్వారా చేయబడిన ప్రతివ్యవస్థయందును ధార్మికసంస్కారములకు సాన్నిధ్యము కలదు. గాయత్రి మొదలుగాగల మంత్రములవలన నేయేకార్యములు సిద్ధించుచున్నవో ఆయామంత్రముల యర్థములతోడ సమానార్థమునిచ్చు నన్యమంత్రములవలనను, ఇతరభాషాపదంబుల

వలనను సిద్ధింపనేరవు. వానిమూలమున నట్టిపుణ్యమును లభింపనేరదు. ఒక మంత్రమందలి వాక్యములను, పదములను వెనుక ముందునుంచి జపించుటచేతను గూడ నట్టిఫలము లభింపదు. అట్టియెడ "రైస్ బాల్" అను శబ్దమునుండి తండుల పిండమనియు, స్తంభశబ్దమునుండి యూపమనియు నర్థము లెట్లు వెలువడును? పిండము, యూపము, ఆహవనీయము మున్నగువానినుండి ఆయా సంస్కారములతో గూడిన ధార్మికార్థములే గ్రహింపబడును. కావున హిందువుల యొక్క ధార్మికజీవన నిర్వహణవ్యవస్థయు సామాజికజీవన నిర్వహణ వ్యవస్థయు మూలంబులగు వైదిక గ్రంథముల మీదను, నార్ష గ్రంథములమీదను ఆధారపడి యున్నవి. లోకదృష్టియం దేదేని నిర్విఘ్నముగను, దోషరహితముగను సాగిపోవు వేరుమార్గ మున్నను నది యాస్తిక్య బుద్ధికల హిందువులకు గ్రహణీయము కాదు. స్మశానాగ్నిచేత పప్పు, బియ్యము నుడుకబెట్టుకొన వచ్చును. కాని యాస్తికుడెన్నడు నట్టిపని చేయడు.

స్మృతి పురాణములయొక్కయు, మహర్షులయొక్కయు విచిత్రములగు విభిన్నవచనములను జూచి కొందఱు జనులు శాస్త్రములు, ధర్మములు దేశకాలపరిస్థితి ననుసరించి మారుచుండుననియు, విభిన్నస్మృతికారులు తమ దేశకాలపరిస్థితి ననుసరించి ధారణపోషణానుకూలముగా రచించిన నియమములే శాస్త్రములనియు జెప్పుదురు. కాని యట్లు చెప్పుట పూర్తిగ నసంగతము. "విరోధే త్వనపేక్షంస్యా దసతి హ్యను

మానమ్'' అది జైమిని సూత్రములనుబట్టి పూర్తిగ స్పష్ట మగుచునే యున్నది. వేదముల ననుసరించియే స్మృతులన్నియు నేర్పడినవి. నేడు కొన్ని పరిస్థితుల నన్నిటిని దృష్టిలోపెట్టుకొని యెట్లుగ విధానములు చేయబడుచున్నవో అట్లే పరమేశ్వరుడును సర్వదేశకాలపరిస్థితులను దృష్టియందుంచుకొనియే యీనిత్యవిధానమును రచించెను. కాని భేదమేమి యనగా లౌకికవిధానములను నిర్మించువా డల్పజ్ఞుడు. కావున నాతని విధానమందు లోపములుండును. భగవంతుడు సర్వజ్ఞుడు కావున నాతని విధానమం దెట్టి లోపము నుండదు. ఆపత్తి సంపత్తి కాలభేదమునుబట్టి సూక్ష్మముగను విప్రకీర్ణముగను వేదములందు చెప్పబడిన ధర్మములనే సంకలన మొనర్చి స్మృతికారులు స్మృతులను నిర్మించిరి. "శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్" శ్రుతి విరుద్ధమగు స్మృతి యేదియైనను త్యాజించవలసినదే. అట్టియెడ నేటి మనుజు డెవండైన వేద విరుద్ధవిధానమును నిర్మించిన దాని నెట్లు గ్రహింపనగును? నేటివరకుగల "హిందూ లా" మితాక్షరా శాసనపద్ధతి దాయ భాగముకూడ మను, యాజ్ఞవల్క్యుల మీదను, వేదముల మీదను ఆధారపడి నిర్మితములైనవి. నేటివరకు హైకోర్టులందును, ప్రివీకౌన్సిలు లందునుగూడ నీవచనముల యర్థము లే గ్రహింపబడును. స్వేచ్ఛాచరణమునకు సాహసింపబడుట లేదు. ఈ దృష్టిచేతనుగూడ నేటి హిందువుల విధానము వేదమే. ఈశ్వరుడు మృతిఁబొందనంతవరకు, లేదా యవకాశమును గ్రహించి తన యధికారమును హస్తాంతరిత మొనర్చ

నంతవరకు, లేదా తాను పరాజయమును బొందనంతవరకు, లేదా తనవిధానమం దాతనికి లోపము గోచరించనంతవరకు ఆతని విధానమందు జరివర్తనమును చెప్పుట క్రొకని కెట్టి యధికారము నుండదు. ఈశ్వరుడు నిత్యుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిసమేతుడును కావున నాతనిలో బూర్వోక్తావస్థలు సంభవింపనేరవు. అట్టిస్థితియందాతని విధానము నొక రెట్లు మార్పు చేయగలరు?

ఇంతియగాక ఫలము నిచ్చువాడే ధర్మాధర్మములను మార్పు చేయగలడు. ఆ ఫలము నీశ్వరుడు తప్ప నేవ్యక్తియు సమూహము నీయజాలదు. కనుక నెవరికిని ధర్మాధర్మముల మార్పుచేయు నధికారము లేదు. పత్రికముల యొక్కయు, వ్యక్తులయొక్కయు సమ్మతుల కచ్చట విలువయేమియు లేదు. ధర్మాధర్మములు మార్పు చేయుటకుగాని, చేయకుండుటకు గాని ఫలప్రదాత యగు పరమేశ్వరుని సమ్మతియే ముఖ్యము. ఆతని హస్తాక్షరము లేక సమ్మతియు లేనిదే యర్బుదముల కొలది విద్వాంసుల సమ్మతులున్నను ప్రయోజనము లేదు. అనాదులు నపౌరుషేయములు నగు వేదములే యాతని నిశ్వాసభూతవచనములు. అవియే యాతని నిత్యజ్ఞానానువిద్ధ మగు శబ్దరాశి. దానికి విరుద్ధములగు సమ్మతులన్నియు వ్యర్థములే. ఒక వ్యక్తి తన జన్మకర్మములనే యెరుగడు గదా! యెరింగినను ఫలప్రాప్తి యాతని చేతిలోనిది కాదుగదా! ఇట్టి స్థితియందు సగోత్రవివాహముల వలనను, అంతర్జాతి వివాహముల వలనను పుణ్యమొదవునో, లేక పాపమే యొదవునో,

నరకప్రాప్తి యగుసనో, లేక స్వర్గము లభించునో అను విషయ మీశ్వరునికే తెలియవలయును గాని యన్యుల కెట్లు తెలియును ? ఈశ్వరుఁడే యనంతకోటిబ్రహ్మాండముల నెఱుఁగును. ఆతఁడే యొక్కొక్క బ్రహ్మాండమందలి జీవులను, ఒక్కొక్క జీవుని యనంతానంత జన్మలను, ఒక్కొక్క జన్మయొక్క యనంతకర్మములను, ఒక్కొక్క కర్మయొక్క లెక్కలేనన్ని విచిత్రఫలితములను ఎఱుఁగును. ఫలమునిచ్చు శక్తియు నాతనికే కలదు. కనుక నాతని విధానమే ధర్మాధర్మములకు ప్రమాణము. ఇందుచేతనే హిందువులు వేదములను, వాటి ననుసరించి నిర్మితములైన యార్షగ్రంథములను మాత్రమే తమ విధానములగా భావింతురు.

మఱియు దానిని మార్పుచేయ నెవ్వనికి నెట్టి యధికారము లేదని యూహింతురు. ఈశ్వరుడు, నాతని రామకృష్ణాది యవతారములు. వసిష్ఠుడు, మనువు మున్నగువారు కూడ నావిధానములనే పాటింప నుపదేశింతురు. కాని మార్పు చేయుటకు వారికెట్టి యధికారమును లేదు. కావుననే నిశ్వాసములవలె బుద్ధిప్రయత్ననిరపేక్షములు అగుటచే వేదములు అకృత్రిమములు, నపౌరుషేయములు నని చెప్పబడినవి. అట్టియెడ వాటికి విరుద్ధవిధానముల దయారుచేయ నెవ్వనికి నెట్టి యధికారమును లేనేలేదు. ఇంతియగాక ప్రతిరాష్ట్రమునకు, సంతర్రాష్ట్రియలోకమునకు శాసనమూలమున నొకధర్మమందు జోక్యము కలుగజేసుకొనకుండుట నియమమొకూడ యున్నవి. సంయుక్తరాష్ట్రసంఘముకూడ నీవిషయమునే ఘోషించును.

భారతీయ నవీన విధానమునకు మూలభూతమగు ఘోషణ యందు 'ఏధర్మమందు ప్రభుత్వ మెట్టిపోక్షము కలుగజేసు కొనద'ను విషయము అంగీకరింపబడినది. ఇంతియ గాక నానియమము క్రైస్తవ ముస్లిము మతములయెడ బాటింప బడుచును ఉన్నవి. కాని యొక్క హిందూధర్మముయెడనే యానీతి పాటింపబడుటలేదు. పైగా నానీతిని బాటించుచునే యున్నామని యనుకొనుటకై వివాహ దాయభాగములు ధర్మములు కావనియు, నవి సాంఘిక వస్తువులనియు ప్రభు త్వమువారు చెప్పుచున్నారు. కాని యా యా ధర్మములను బరిశీలించునపు డాయా సంప్రదాయములకు సంబంధించిన ధర్మగ్రంథములను అనుసరించవలయునను విషయముస్పష్టము. ఈదృష్టిచేత హిందూధర్మవిమర్శనము హిందూధర్మగ్రంథము లను, హిందూధర్మాచార్యులను అనుసరించి చేసినపుడు ప్రస్తుత హిందూకోడుబిల్లు హిందూధర్మమునీద నెట్లుగా దాడిచేయుచున్నదో సుస్పష్టము కాగలదు. గోవధవంటి నీచ కృత్యములను మహమ్మదీయధర్మ మను తలంపుతోడ బ్రోత్సహించుటయు, హిందువుల వివాహ, దాయభాగ, మందిరాది శుద్ధ ధార్మికవస్తువులను సామాజికములను తలంపుతోడ నణచివేయ బూనుకొనుటయు జూడగా నత్యా శ్చర్య మొదవుచున్నది.

# హిందూకోడ్ బిల్ సమీక్ష

## —* సామాన్య వివేచనము *—

హిందూకోడు బిల్లునం దెన్నిమారులో హిందూధర్మ మను నామము వచ్చినది. కాని హిందూధర్మమన నేమి? దానికాధారస్వరూప ప్రమాణంబు లెవ్వి? యను విషయము విచారించబడినటు లెచ్చటను గానరాదు. కావున నిది యపూర్ణము. ప్రయోజనము లేనిది. హిందూకోడును సమర్థించుచు నొక మహాశయు డిటు లనెను — "ఈ బిల్లు హిందూ ధర్మమును రక్షించునది కాని భక్షించునది కాదు. కారణ మేమనగా ఈబిల్లుమూలమున హిందూధర్మమును ద్వేషించువాలని కనేక యధికారములు లేకుండ జేయబడినవి. హిందూధర్మమును బరిత్యజించినవా డల్పవయస్కులను, నజ్ఞానులను పాలింప వీలులేనట్లే యువతి పునర్వివాహము జేసుకొన్నను, హిందూధర్మమును విడనాడినను దత్తతాధికారము లేనిదగును." ఈవిధముగ ననేక ప్రమాణముల మూలమున కోడుబిల్లువారు హిందూధర్మ రక్షణమే కోరుచున్నారని నిరూపింపబడినది. కాని హిందూకోడుబిల్లునం దీవాక్యము లున్నను వేదాదిశాస్త్రములకు విరుద్ధముగా నసవర్ణ వివాహమును, సగోత్రవివాహము, విడాకులచట్టము— స్పష్టీకరింపబడినవనగా, ఈబిల్లును బ్రతిపాదించువారు అధర్మ

మును ధర్మమని భావింతురనియు, నారు ధర్మము నుల్లంఘించ రను దాని భావ మధర్మము నుల్లంఘించరనియు మన మను కొనవలసి నన్నును. అధర్మమును ధర్మమనుకొనువారు పూర్వము కూడ గొంద ఱుండెడివారు. కొందఱు రాక్షసులు పరదారాగమనమే తమ ధర్మమని భావించెడివారు. ఇట్టి స్థాన ములందు ధర్మశబ్దము నుపయోగించుట భ్రాంతిమూలకమని సుస్పష్టమైనది. "చోదనాలక్షణోఽర్థో ధర్మః" "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే" ఇత్యాది వచనములద్వారా శాస్త్ర విహితకర్మమే ధర్మమనియు, శాస్త్రనిషిద్ధ కర్మమే యధర్మ మనియు వ్యక్తమగుచున్నది. బహిరంగముగా నంతర్జాతీయ వివాహములను, విడాకుల చట్టమును, సంకరసృష్టిని ప్రోత్స హించు హిందూకోడుబిల్లు వలన ధర్మమెట్లు రక్షింపబడును? ధర్మమును గ్రహించుటకు ముందాధర్మమును, దాని ప్రమా ణమును నిర్ణయించుకొనవలసివచ్చును. అందులకై వేదము లను, ధర్మశాస్త్రములను.పూర్వమీమాంసనువిమర్శించవలసి యుండును. ధర్మము పేరట నేవియో కొన్ని వాక్యములను వ్రాసినంత మాత్రమున ధర్మనాశకమగు కోడుబిల్లు ధర్మ రక్షక మగునా? సారాంశ మేమియనగా హిందూకోడును నిర్మించువారిచే కల్పింపబడిన ధర్మమును ద్వేషించువాతడే యిచట హిందూధర్మత్యాగి యని యూహింపబడును. కాని శాస్త్రవిరుద్ధధర్మ మెప్పటికైనను నధర్మమే. ఈ యధర్మమునే కోడుబిల్లును ప్రతిపాదించువారు ధర్మమని భావించుచున్నారు.

" అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సాపార్థ తామసీ ॥ "
(గీత 18-32)

అందఱను ఏకసూత్రమున బంధించునది యని చెప్ప బడుచున్న యీబిల్లునందు చెచటను ధర్మశబ్దమునకు బరిభాష చెప్పబడలేదు. 'హిందూ' శబ్దమునకు మాత్రము పరిభాష చెప్పబడినది. కాని యాపరిభాష యే ధర్మమును బొందకుండ జేయబడినది. మహమ్మదీయము, క్రైస్తవము మున్నగువాని పరిభాషలకు వారి ధర్మగ్రంథములాధారములు. కాని హిందూ శబ్దమునకు పరిభాష వేదశాస్త్ర నిషేధము నాధారముగ జేసు కొనియో లేక యసమంజసాధారమును గైకొనియో చేయ బడినది.

ఇందు 'హిందూధర్మముయొక్క యే స్వరూపమును, సంప్రదాయమును స్వీకరించువాడయినను హిందువుడనబడు' నని చెప్పబడినది. కాని యీశ్వరుడు, అస్తేయము, ధృతి మున్నగువానిని హిందువులు కానివారుకూడ స్వీకరింతురు గదా! అట్టియెడ నందఱు హిందువులేల గాజాలరు? ఒకయెడ 'హిందూ ధర్మముక్క యేస్వరూపమును, సంప్రదాయమును గ్రహించినను మనుజుడు వీరశైవము, లింగాయతము, బ్రహ్మ సమాజము, ప్రార్థనాసమాజము, నార్యసమాజము – వీటిలో నేదొయొకదానికి సదస్యుడయ్యు హిందువు డనబడును.' అని చెప్పబడినది. కాని హిందూధర్మముయొక్కయు, సంప్రదా యముయొక్కయు బరిభాష, ప్రమాణము నావశ్యకము

లయ్యు నవి యిందెచటను జర్చింపబడలేదు. కొంత ముందు నకుబోయి బౌద్ధ, జైన, సిక్కు ధర్మముల నవలంబించువారు కూడ హిందువులే యని పరిగణించిరి. ఇది లక్షణవైరూప్య మన్నమాట. ఒకమారు హిందూధర్మానుయాయిని హిందు వనినారు. రెండవమారు సిక్కు, జైన, బౌద్ధమతస్థులుకూడ హిందువులే అని యనినారు. సిక్కు మున్నగు మతస్థులు హిందువులని చెప్పబడినప్పుడు హిందూధర్మానుయాయిని సిక్కు మున్నగు మతస్థులుగా నేల బరిగణింపకూడదు? ఒకడు అన్యమతము నవలంబించినంత మాత్రమున నామతాను సారముగ నన్యశబ్దముచే వ్యవహరింపబడుచున్నాడు గదా! అట్టియెడ మహమ్మదీయ క్రైస్తవులు మాత్రము హిందూ పదవాచ్యులేల కారు? అట్టియెడ "హిందుస్తానీకోడుబిల్లు" అనుట చాలమంచిది. 'హిందూ' శబ్దమును ప్రయోగించి ప్రభుత్వము ఈ సాంప్రదాయకత్వపు పంకమున నేలజిక్కు కొనవలయును?

ఉచితుడు, ననుచితుడు నెట్టివాడయ్యు నేబాలకుని తల్లిదండ్రులలో నొకరు హిందువులైయుందురో యాబాలకుడు కూడ హిందూశబ్దవాచ్యుడని చెప్పినారు. ఇది యొక విచిత్ర భావ. తల్లి హిందువయిన మాత్రమున నాపె బాలకుడు కూడ హిందువు డనబడదగు ననినారు గదా! తండ్రి యన్య జాతీయుడయిన నాతని బాలుడు కూడ నన్యజాతీయుడని యేల చెప్పబడ కూడదు? వాస్తవమున జాతియొక్క లెక్కయే లేదందుకా? దానికి తావేల నీయబడుచున్నది. ఏవస్తువున

కైన ప్రమాణాధారముల యొక్కటి లేకయే ప్రభుత్వమునకు జెందినవారు, చెందనివారు నంగీకరించినంత మాత్రమున హిందుత్వము వచ్చువేయునా ?

ఇట్లే హిందూధర్మము నవలంబించువాడు హిందువు డనబడు ననినారు. కాని హిందూధర్మముయొక్క పరిభాషను గాని వాని ప్రమాణమునుగాని, ధర్మము నవలంబింపదగు పద్ధతినిగాని నిరూపించి యుండలేదు. ఇందు మూలమున నీ కోడుబిల్లు అపూర్ణమైనదనియు, దీని నిర్మాతలు విశేషజ్ఞులు కారనియు చేటతెల్లమైనది. దీని ఫలిత మెటులుండుననగా నెవండైన దన తోచినపట్టున నేను హిందూమతము 'నవలం బించినాను' అనుటతోడనే హిందువులలో బరిగణింపబడ నారంభించును. ఈవిధముగగాని గొన్నితరములనుండి యీహిం దువుడుగా వచ్చుచుండు వ్యక్తికూడ నొక్క క్షణమందు హిందూధర్మము నవలంబించి, హిందువై యేహిందుకోటీ శ్వరుని యాస్తికో యజమానియై మరల నహిందువుడు కాగలడు.

కోడుబిల్లులో మున్ముందు 'ఎవండైన దనను హిందువు డని యనుకొనినను లేక ఘోషణ జేసినను హిందువుడనియే భావింపబడు' నని కూడ జెప్పబడియున్నది. కాని యిపుడా యంశము తీసివేయబడినది. వాస్తవమందు శాస్త్రములను గాని ధర్మములనుగాని, జాతి వర్ణవిభేదమునుగాని యంగీక రింప నెంచుకొననివారల కీపటాటోప మంతయు నెందులకు ? వారు స్వయముగ నహిందువులు గదా ? హిందూధర్మము

పేరట బిల్లులను తయారు చేయుటకు వారికెట్టి యధికార మున్నది ?

అంతమందు ముజిల నానిషేధాత్మకపరిభాషనే యిచ్చి నారు. ఏమనియనగా, — "మహమ్మదీయుడుగాని, క్రైస్తవుడు కాని, పారసీకుడు కాని, యహూదుకాని కానివాడు కూడ హిందువుడనియే యెంచబడును." దీనిని బట్టి యంద అకు నొక పరిభాష యాధారము కలదనియు, హిందువులకే నిర్మాతల దృష్టిలో నెట్టి పరిభాషయు, నాధారము లేదనియు వ్యక్తమగుటలేదా ? వాస్తవమం దీలజ్జావిహీన హిందువులు కూడ నొక హిందువులేనా ? హిందూకోడును నిర్మించుటకు వీరికధికార మేమయిన నుండవచ్చునా ? అంతమున 'నొకడు హిందూధర్మమునకు, జాతికి జెందనివాడయ్యు, హిందూ కోడు ద్వారా శాసింపబడినంత మాత్రమున నాతడు కూడ హిందువుడుగ దలవబడును' అను పరిభాష కూడ నీయబడి నది. ఇదియు నొక విచిత్రపరిభాషయే. ఇందుగల అవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవత, మున్నగు దోషములు వారికి గోచ రించనేలేదు కాబోలును. బుద్ధికు తట్టినదేదియో వ్రాసి పెట్టి నటులున్నది. యథార్థమందు 'హిందూ లా' మొదట హిందూధర్మశాస్త్రముల ననుసరించి రచింపబడినది. అందు చేతనే యా హిందూధర్మ శాస్త్రానుసారము శాసింపబడు వాడు హిందువు డనబడుచుండెడివాడు. కాని నేడో హిందూ కోడుబిల్లు హిందూ శాస్త్రములకు పూర్తిగా వ్యతిరిక్త ముగ నడచినది కదా ! అట్టియెడ హిందూలా ప్రకారము

శాసింపబడువారు నేడు హిందువులని యెట్లు చెప్పబడుదురు! అనగా నిచట నన్యోన్యాశ్రయ దోషము కూడ పట్టినదన్న మాట. హిందూశబ్ద పరిభాష నిశ్చితమయితే హిందూ కోడును నిశ్చితమగును! హిందూకోడు నిశ్చితమయిన తద్వారా శాసింపబడువాడు హిందువు డగబడును. వాస్త మున జాతివర్ణములతో నిమిత్తము లేక పెండ్లి చేసుకొన గోరువారు "స్పెషలు మేరేజి యాక్టు" ప్రకారము తా మహిందువులమని చెప్పుకొనవలసియుండును. అట్లు చెప్పుకొన నక్కఱయు లేకుండవలె. హిందువులైయుండి స్వేచ్ఛాచర ణమునకు నుద్యతులు కావలె. — నిదియే యీ బిల్లు యొక్క యుద్దేశ్యము. కనుకనే పై యాక్టుప్రకారము పెండ్లి చేసుకొన్నవారు కూడ హిందూకోడు చేతనే శాసింపబడు దురు' అని కూడ చెప్పబడినది హిందూకోడు పేసయిన పిమ్మట దీనిద్వారానే అట్లుచేయుట కవకాశ మీయబడ గలదు. అందుచేతనే బుద్ధిమంతులగు జను లీబిల్లుద్వారా వేశ్యాస్త్రీని పరమసాధ్వీలలామ యగు కులీనస్త్రీతో సమా నముగ నుంతుమని చెప్పుచున్నారు. ఈకోడులో చెప్పబడిన పరిభాష ప్రకారము ఏ విజాతీయుడైనను కన్యాలోభము చేత గాని, ధనలోభముచేత గాని నిమిషములలోపల హిందూ ధర్మము నవలంబించి తన మనోరథ మీడేర్చుకొని తన మొదటి మతములోనికి తిరిగి పోవచ్చును. ఇందు దీని కభ్యం తరమేమియు లేదు. ఇట్లు ఇతరమతస్థులకు హిందువులమీద దాడి చేయుట కవకాశము చిక్కును. హిందూకోడుబిల్లును

నిర్మించువారి యొక్కయు, స్వీకరించువారి యొక్కయు, మూర్ఖత్వకారణముగా నవ్యమతస్థుల సంఖ్యయు, సంపదయు పెరిగి పోవును. శాస్త్రవిరుద్ధములగు నాచారవ్యవహారము లన్నియు బరిత్యజింపవలసినవే. కాని శాస్త్రవిరుద్ధమగు హిందూకోడు మాత్రము ఏనాటికిని శాస్త్రపదవిని బొందనేరదు సరి కదా ! అనాదినుండి వచ్చుచున్న నాచారవ్యవహారము లకు అభ్యంతరము కలుగును.

ఈ కోడుబిల్లు అమలు జరుగ మొదలిడిననాటినుండి పూర్వపుశాసనము రద్దగుటయు, ఇది భారతదేశమందంతటను వ్యవహరింపబడుటయు జరుగును. ఈ దృష్టిచేత నీ బిల్లు భారతదేశమునకు బయట వెల్ల నేరదు. ఫలరూపకముగ నచటి (విదేశములందున్న) భారతీయులందఱియొక్కను విదేశ శాసన క్రమమే నిర్వహించబడును. ఒక యాంగ్లేయు డచటనైన మృతిబొందిన నాతని సంస్కార దాయభాగాదు లన్నియు నాంగ్లేయ శాసనప్రకారముగ జరుగుటయు, హిందువు డొక డచటనైన జనిపోయిన నీతని సంస్కారదాయభాగాదు లాదేశ శాసనప్రకారముగ జరుగుటయు నెంత శోచనీయవిషయము ! నిజముగ నీ బిల్లు దేశము నాధారముగ జేసుకొని చేయబడి నది. కాని యొక వ్యక్తినిగాని, జాతినిగాని యాధారముగ జేసుకొని చేయబడ లేదు.

"హైకోర్టులయొక్కయు, ప్రివీకౌన్సిలుల యొక్కయు నిర్ణయములందు వ్యాప్తికెంది యేయే హిందూశాసనము లయితే సాధారణజనుల కాశ్చర్యమునుగొల్పుచు దావాలను,

కేసులను పెంపొందించుచున్నవో వీటన్నిటిని క్రమస్థితికి దెచ్చుటే హిందూకోడుయొక్క లక్ష్యము" అని చెప్పబడినది. అనగా హిందూలానంతను స్పష్టముగను, సులభసుబోధముగను, ఏకరూపముగను జేయుటయు, దావాలను కేసులను నిరోధించుటయు హిందూకోడుయొక్క ఉద్దేశ్యము. కాని యీ బిల్లుమూలమున కేసులు దావాలు నెంత యధికమయి పోవునో ముందుముందు పాఠకులకే తెలియగలదు. సోదరునకు, సోదరికి సమానభాగము నిచ్చుటమూలమునను తండ్రికి విల్లువ్రాయు నధికారమును వ్యవస్థ చేయుటచేతను కేవలముక్క యున్నచెల్లెండ్రకే కాక తండ్రి కుమార్తెలకుకూడ తగవులు వచ్చి కేసులు దావాలు వృద్ధిపొందును. ప్రతి గృహమందు కన్యయొక్క యత్తవారుగాని, అల్లుండ్రుగాని అందలి కొంతభాగమును కొనుక్కొన్న యన్యజాతివ్యక్తులుగాని నివసించుటచేత నెంతెంతటి సంఘర్షణములు బయలుదేరునో, ఎన్నికేసులు జరుగునో ప్రతివ్యక్తియు సులభముగ గ్రహించవచ్చును. అట్టే విభాజనముల మూలమునను, మృత్యుకరసంబంధముగను జరుగు కేసుల కంతముండదు. సంపదా నశించును. వివాహపు రిజిస్ట్రేషనులకును, విడాకుల చట్టము నిమిత్తముగను హైకోర్టులవరకు బోవలసివచ్చును.

బిల్లునుండి 'మితాక్షరా' 'దాయభాగము' నను భేదమును దీసివైచి శాసనమునంతను ఏకరూపమును బొందించుటకు బ్రయత్నించిరి. 'మితాక్షరా'ను బట్టి హిందువునియాస్తి వ్యక్తిగతముకాక పైతృకమైయుండును. తండ్రి, కుమారులు,

మనుమలు, మునిమనుమలుకూడ దానిని పంచుకొనదగువారు ఆ స్త్రియందు వ్యక్తులకు జన్మసిద్ధమయిన యధికారముండును. పైతృకసంపత్తును బంచుకొనదగు వాడెవడైన జనిపోయిన నాతని సంపద మిగతబ్రతికియున్న భాగస్థులకు జెందిపోవును. కాని బిల్లుయొక్క దాయభాగసిద్ధాంతమును బట్టి వారసుని యాస్తి యాతనికి వ్యక్తిగతమైయుండును. అనగా నాతని కాయాస్తియందు దానవిక్రయసత్తాధికారములు సంపూర్ణముగ నుండును. లోకమాన్య తిలకు మహాశయుడు "స్వరాజ్యము మా జన్మహక్కు" అని ఘోషించగా, కాంగ్రెసు వారు లందఱు దానిని మఱింత పెచ్చరిల్లజేసిరి. కాని హిందువులు 'మా సంపదలో మాకు జన్మసిద్ధాధికారమున్నది' అనినపుడు వీరి యీ సిద్ధాంతమును బూర్తిగ నణగద్రొక్క ప్రయత్నించుచున్నారు. ఆస్తికి శాసనమూలమున నొకవ్యక్తి యెప్పుడయితే వారసుడగునో, యప్పుడే మృత్యుకరపరిస్థితియు దటస్థించును. ఇందు మూలముననే సమ్మిలిత కుటుంబముల రివాజు నశించును. ఆస్తులు విభజింపబడిపోవును. అందు ప్రభుత్వమునకు గూడ భాగమేర్పడును.

పూర్వ మాస్తిని మగపిల్లలే పంచుకొనెడివారు. ఇపుడాడపిల్లలుకూడ బంచుకొందురు. ఈవిధముగ భర్తృకుటుంబము యొక్కయు, పితృకుటుంబము యొక్కయు నాస్తులన్నియు నెన్ని భాగములైన నంతయధికముగా ప్రభుత్వము వారికి మృత్యుకరము ముట్టును. కుటుంబ మందలి యే వ్యక్తియు నే దగు లాభమును బొందనేరదు. కాని ప్రభుత్వము

నకు మాత్ర మధికలాభమున్నది. ఒకయెడ తండ్రి యాస్తి యందు ఆడపిల్లల కధికారము జూపుటయు, వేఱొకయెడ తండ్రికి విల్లువ్రాయు నధికార మీయబడుటయు జూడగా కొంత యాశ్చర్యముగనే యున్నది. అనగా, తండ్రియాస్తి నాడపిల్లలకీయ దలంపనియెడల గొడుకులపేర విల్లువ్రాసి యిచ్చివేయవచ్చునట. ఇట్టి విల్లుకాగితము వ్రాసిన తండ్రి కూతుళ్ల విరోధము. వ్రాయకున్న తండ్రి కుమారులకు విరోధము. మఱియు నన్నచెల్లెండ్రకు కలహము.

ఇటు లెప్పుడయితే శాస్త్రధర్మముల విశ్వాసముడుగంటునో, అపు డర్థకామములే ప్రధానములగును. ఇక నాస్తుల యందలి కాంక్షలమూలమున నాడుబిడ్డల హత్యలు పెరిగి పోవును. ఏతత్సంబంధమగు నీర్ష్యలమూలమున నాడుబిడలు తమ తండ్రులకు, సోదరులకు విషము నీయవచ్చును. తోడనే 'తల్లి యొక్కతె తప్ప మిగిలినస్త్రీలందఱు వివాహార్హలే' అను మహమ్మదీయాచారప్రకారముగ నాస్తులందలి కాంక్షల కొలది హిందువులలోగూడ నన్నచెల్లెండ్ర పెండ్లిండ్లు సంభవించును. శాస్త్రధర్మములందు విశ్వాస మేర్పడుట కష్టముకాని యంతరించుట కఠినము కాదు. సగోత్రవివాహము, నసవర్ణ వివాహము ప్రచలితమైనతోడనే రానురాను అన్నచెల్లెండ్ర పెండ్లిండ్లయందుకూడ నభిరుచి పొందగును. ఎప్పటికైన శాస్త్రధర్మ విశ్వాసమే ప్రజలను నీచాతినీచ ప్రవృత్తులపాలు బడకుండ గాచునది. పైవిశ్వాస మంతరించుటతోడనే ప్రజలను సవరించుట కఠినమేకాక నసంభవమయిపోవును. అన్నిటి

కంటె నత్యాశ్చర్యజనకమగు విషయమేది యంటే ప్రస్తుత బిల్లు ప్రతిపాదకులు ఒకయెడ "దాయభాగమునకు, ధర్మము నకు సంబంధ మేమి? ఇది లౌకికవిషయముకదా!" అని పల్కుచు శాస్త్రముల నించుకంతయైన లెక్క చేయక నిష్టము వచ్చినరీతిని నవీనదాయభాగ విధానమును ఏర్పరచుచున్నారు. వారే వేఱొకయెడ కన్యకు పైతృకసంపదయం దధికారము కలదని నిరూపించుటకునై మను, యాజ్ఞవల్క్యులు రచించిన

" స్వేభ్యోంశేభ్యస్తు కన్యాభ్యః ప్రదద్యుర్భ్రాతరః పృథక్ ।
స్వాత్స్వాదంశాచ్చతుర్భాగం పతితాః స్యురదిత్సవః॥ "

(మను - 9 - 118)

ఇత్యాది వచనముల నాధారముగ దీసుకొని 'కన్యకు భాగమీయని సోదరుడు పాపి, పతితుడు నగు'నని చెప్పు చున్నారు. 'అవివాహితయగు కన్యయే తండ్రి యాస్తియందు భాగమును బొందనర్హురాలు'అని శాస్త్రములు చెప్పుచున్నవి. కాని యీబిల్లు వివాహిత, అవివాహిత - ఇద్దఱు కన్యలకు గూడ తండ్రి యాస్తియం దధికారము కలదని చెప్పు చున్నది.

'దేవాలయప్రవేశము, వివాహము, విడాకులచట్టము, వారసత్వము మొదలగునవి రాజ నైతిక విషయములు సమాజమునకు జెందినవి. వాటికి ధర్మముతోడ సంబంధము లేదు' అని నేటిజనులు కొందఱందురు. వివాహ, మందిర ప్రవేశాదులే ధర్మమునకు జెందినవి కానిచో నిక ధార్మిక

మయినదేదియో నిశ్చయించుటయే కష్టము. ఆలయములు, అందలి విగ్రహములే ధార్మికములు కానిచో బజారులో విక్రయింపనున్న విగ్రహములను జూచియే సంతసింప వలయును. వివాహము ధర్మమే కానియెడల తండ్రీ కూతుళ్ళకు నన్నచెల్లెండ్రకు పెండ్లిండ్లు జరుగవలసినదే. కాని దేవాలయ ప్రవేశమునకు ప్రోత్సాహ మిచ్చుచున్న ప్రస్తుతబిల్లు ప్రతి పాదకు లీవిషయము నేలకో యంగీకరించుటలేదు. వాస్తవ మందు మహమ్మదీయాది మతములవలె ధర్మాధర్మ నిర్ణయ మును శాస్త్రములైన జేయవలె. లేక ధర్మాచార్యులైన జేయవలె. అంతియకాని 'మాకు సంప్రదాయములతో బని లేదు' అని చెప్పుకొను నీప్రభుత్వ మింత ప్రపంచమును విస్త రింపజేసి యీ సాంప్రదాయికపు బంకమున నేల జిక్కుకొన వలయును? ప్రభుత్వమువారు వేదాదిశాస్త్రములను, ధర్మ శాస్త్రములను బట్టి హిందువులను ధర్మనిర్ణయము జేసుకొన నీయవలయును. ఆ శాస్త్రముల బట్టి ప్రస్తుత హిందూకోడు మున్నగునవి, ధర్మముమీద దాడి చేయుచున్నవనుమాట నిక్కము.

ఒకప్పుడు డాక్టరు అంబేడ్కరు 'ఏకపత్నీ విధానము సమస్త ప్రపంచేతిహాసమునను గలదు' అని పలుకగా నొక మహాశయుడు 'మహమ్మదీయులా' విషయమున దమయాశయ మేమని ప్రశ్నించెను. తోడనే వారు 'మహమ్మదీయమతమం దెన్ని పెండ్లిండ్లయినను చేసుకొనవచ్చును. తప్పులేదు' అని సెలవిచ్చి తప్పుకొన్నారు. సారాంశ మేమియనగా ముసల్మా

నుల విషయమున నేదేని బిల్లును నిర్మించుటకు శ్రీ డాక్టరు మహాశయులకు శక్తి చాలదన్నమాట.

ఈ కోడుయొక్క పరిభాష లన్నియు శాస్త్రసీమల నుల్లంఘించునవియే. ఇందు 'సపిండ' శబ్దమునకు శాస్త్రవిరుద్ధమగు పరిభాష చెప్పబడినది. సపిండత్వమయిదు లేక ఏడేండ్ల వరకు నుండునని శాస్త్రము లంగీకరించగా బిల్లువారు మూడు లేక నయిదేండ్లవరకు మాత్రమే యుండుననిఅంగీకరించినారు. దత్తుని (పెంచుకొన బడినవాడు) విషయమునను, అంతర్జాతీయకన్యక యొక్క సంతానమువిషయమునను ఇంకను నిట్టి శాస్త్రవచనములు చాల గలవు. బిల్లులో శాస్త్రములను ప్రమాణముగ దీసుకొన్నప్పుడు సగోత్రవివాహము ఏల నిషేధింపబడ లేదు. అట్లు ప్రమాణముగ దీసికొన మందురా? అన్న చెల్లెండ్రయొక్కయు, పినతండ్రి సోదర పుత్రికల యొక్కయు, మేనత్తా సోదర పుత్రుల యొక్కయు, లేదా యిరువురు సోదరులయొక్కయు, సోదరీమణుల యొక్కయు సంతతుల యొక్క వివాహము లేల నిరోధింపబడవలయును? దీనికి స్థిరప్రమాణ మెయ్యది?

వర్తమానలోక దృష్టిచేతనుగూడ ధర్మవిషయమున నొక బిల్లును నిర్మింప నెకరికెట్టి యధికారమును లేదు. భారతీయ ప్రభుత్వము ధార్మికస్వాతంత్ర్యమును స్వీకరింపను స్వీకరించినది. మహమ్మదీయ, క్రైస్తవులయెడ దానిని పాటింపను బాటించినది. కాని యీ యంతర్రాష్ట్రీయ నియమములకు, రాష్ట్రీయ నియమములకు విరుద్ధముగ నొక్క

హిందూధర్మమందే జోక్యమును కలుగజేసుకొని మందిర ప్రవేశము, హిందూకోడు మొదలగు బిల్లులను ప్యాసుచేసి శాసనము చేయ నెంచుచున్నది. స్వతంత్రభారతము పేరటను, అఖండభారతదేశము పేరటను వర్తమాన ధారాసభ (బిల్లులను ప్యాసుచేయు కమిటీ) ఎన్నుకొన బడినది. ఈ యెన్నుకొనబడిన ధారాసభ ధర్మవిరుద్ధములగు బిల్లులను ధార్మిక, సామాజిక రంగములందు విప్లవమును జెలరేగజేయు బిల్లులను దయారుచేసి ధర్మమును సమగ్రముగ నంతమొందించు నని ప్రజ లనుకొని యుండలేదు. కనుక నిట్టి బిల్లులను ఏర్పరచు నధికార మీ ధారాసభ కెంతమాత్రమును లేదు.

ఇంతియ గాక స్వతంత్రత లభించిన పిమ్మట చాల దేశీయరాజ్యములు భారతసంఘమునందు సమ్మిలితముగావింప బడిపోయినవి. వారియెడగూడ నీబిల్లులు చెల్లగలవు. కాని యీరాజ్యములలోని ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధి యెవ్వడును ప్రస్తుత ధారాసభలో గాన్పింపడు. కావున నీ ధారాసభచే నిర్మింపబడిన బిల్లుల నీరాజ్యములందు బలవంతముగ వ్యవహరింపజేయుట ఎంతయు నన్యాయము.

కోడునందు గ్రహింపబడిన విడాకులచట్టము దానికి గల కారణములు గూడ శాస్త్రవిరుద్ధములు. అసంగతములు. విమనస్కతను వ్యాపింపజేయునవి. విడాకుల చట్టము నిమిత్తముగ రెండు సంవత్సరములవరకు విడచిపెట్టి యుండుటను గాని బలాత్కరించుట మూలమున భీతి చెందుటనుగాని,

రోగ, వ్యభిచార, ఉన్మాదాదులను నిరూపించుటకునై యెన్నెని లేనిపోని కుట్రలు, పన్నాగములు బయలుదేర గలవు. కోర్టులో భార్యాభర్తలొండొరుల వ్యభిచార దోషములనునిరూపించుకొన మొదలిడుదురు. ఈదృశ్య మెంత యసహ్యాకరమైనది? నేటివరకు నెంతటి భయంకరపరిస్థితి యేర్పడినను, పెద్ద క్లిష్టపరిస్థితిలోకూడ నొకరు తోడ్పడినను, తోడ్పడకున్నను భార్యాభర్తలొకరి నొకరు విడచిపెట్టుట లేదు. కాని యికముందు భయంకరజబ్బు పరిస్థితిలో నొకరి నొకరు విడచిపెట్ట బ్రయత్నింతురు. వాస్తవమున శాస్త్ర సమ్మతమగు వివాహమును జెరుపదగు నధికారము కోర్టునకు లేదు. విక్రయ, పరిత్యాగముల మూలమునగూడ భార్య భర్తనుండి వేరుకాజాలదని శాస్త్రములు ఘోషించుచుండగా కోడుబిల్లువారు 'ఏ వివాహ మేయే యితర పద్ధతులమీద నుచితమయ్యు వధూపక్షమువారు, వరపక్షమువారు సమాన గోత్రప్రవరలు కలవారయిన కారణముచేతను, వేర్వేరు జాతులకు గాని, సమానజాతినుండి విడిపోయిన యుపజాతికి గాని చెందినవారయిన కారణముచేతను, అనుచితము మాత్రము కాదని ఘోషించుచున్నారు. దీనిని బట్టి యీ హిందూకోడు హిందూధర్మము నెంతవరకు రక్షించగలదో— దాని గుట్టు బాగుగ బట్టబయలైనది.

'కోడుబిల్లు ఒక భార్య జీవించియుండగా భర్త రెండవ పెండ్లి చేసుకొన వీలులేదని శాసించుచున్నది. నేటివరకు భార్య యనుమతిమీద సంతానాపేక్షతో బురుషుడు రెండవ

పెండ్లి చేసుకొనుట కెట్టియాటంకము లేకుండయున్నది. కాని యింకముందు భార్యయనుమతించినను విడాకుల రిజిస్ట్రీషను చేసుకొననిదే రెండవ వివాహము చేసుకొనిన పురుషుడు శిక్షాపాత్రుడు కాగలడు. ఈవిధముగ విడాకుల చట్టమైనా ప్రచారములోనికి రాగలదు. లేదా భార్యాభర్తలిరువురు విడాకుల చట్టమునుగోరి సంతానాపేక్షచేత ముస్లిము మతమును స్వీకరించి రెండవపెండ్లి చేసుకొనినైనా సంతానసుఖ మనుభవించెదరు. రెండవ పెండ్లి కాకపోదు. విడాకుల చట్టప్రకారము రిజిస్ట్రీషను చేసుకొనినగాని ద్వితీయ వివాహము జరుగదు. రెండవ పెండ్లిని నిరోధించుటకునై సంయమముగా నుండవలయునని ప్రబోధింపబడుచుండెడిది. కాని యిప్పుడు విడాకుల నిర్మాణము, పెండ్లి — ఇవి రెండును సంయమము నుల్లంఘించమనియే ప్రోత్సహించుచున్నవి. ఇందు శాస్త్రవిరోధము సుస్పష్టమగుచునే యున్నది.

ఈబిల్లు ఆమోదింపబడిన మీదట పితృపితామహాదులు చేసిన ఋణములను తీర్చవలసిన బాధ్యత పుత్రపౌత్రుల కెవ్వరికి నుండదు. ఇది కూడ చాలశాస్త్రవిరుద్ధము. నేటి వరకు తండ్రి విషయమున మిగిలియున్న లౌకిక పారలౌకిక కృత్యములను బూర్తి చేసి పితృఋణమును దీర్చుకొనుట పుత్రునకు కర్తవ్యమై యున్నది. ఈపద్ధతి బిల్లుమూలమున తప్పక సమాప్తి చెందగలదు.

వర్ణ వ్యవస్థకాని, జాతి వ్యవస్థకాని పనికిరాదనియు, ఒకే జాతియుండవలయుననియు, జాతిభేదములతో నిమిత్తము

లేకుండ నందఱిలోను వివాహ ఆహార సంబంధమేర్పడవలయు ననియు గొందఱితలంపు. మఱియు నివ్విషయమున హిందూ కోడుబిల్లు మహోపకారము చేయున్నదని తలచి వారు దానికెక్కువ దోహద మిచ్చుచున్నారు. కాని సిద్ధాంతమేమి యనగా ఈ ప్రపంచమే త్రిగుణాత్మకము. గుణముల వైషమ్య మూలముగ సృష్టియు, సమత్వమూలమున ప్రలయ మును జరుగుచుండును. కనుక నెన్నిచోట్లనో వైలక్షణ్య మునకు ప్రమాణములు కన్పడుచున్నవి. వైలక్షణ్యము కన్ప డని చోట్ల 'విశేషము' అనుపేరుగల పదార్థముద్వారా వైలక్షణ్యము గోచరించుచున్నది. గుఱ్ఱము, గోవు మున్నగు పశువులలోను, మామిడిచెట్టు మొదలగు జాతులలోను గన్పడు విచిత్రతను బట్టి చూడ ప్రపంచమున జాతులు, నవ జాతులు కలవనియే గోచరించును. ఇక నాజాతిభేదము మను జులలో నున్న హానియేమి? వేదములందు కూడ అశ్వము, అర్వ, వాజి యను నశ్వజాతివర్ణన మున్నది. ఇట్లే వేదము లందు బ్రాహ్మణ క్షత్రియాది జాతులనేకములు వర్ణించబడి యున్నవి. వారి వారి కర్మలు కూడ వేరువేరుగ జెప్పబడి యున్నవి. వాటి నుపేక్షించిన శాస్త్రద్రోహము చేసినట్లే.

వివాహ ఆహార సంబంధమువలన జనులలో పరస్పర ప్రేమ, సంఘటనము పొసగుననుకొనుట వట్టి భ్రాంతి. ఆధునిక రష్యనులలోను, అమెరికనులలోను వివాహ ఆహార విచారణ ఏమియు జేయబడదు. అయినను వారిలో సద్భావము లేని కారణమున సంఘర్షము జరుగుచునే యుండును. కుక్కలలో

'నిది నాపుత్రిక, ఇది ఒకరిని యాహారము లేక ఈ యాహార మును మనము తాకకూడదని' అను విచారములుండవు. అయి నను వాటియిటంపు భయంకర సంఘర్షణము జరుగుచునే యుండును. శాస్త్ర నాచార విచారములందు భేదమున్నను సద్బుద్ధి, సద్భావనల ద్వారా సంక్షోభావనమును, ఐకమత్యమును స్థాపించవీలగును. పలువురు సైనికులు పలువిధముల శస్త్రాస్త్ర ములతో పలువిధముల యుద్ధములు చేయుదురు. వారి వారి స్థానములుకూడ వేరువేరుగ నుండును. అయినను వారి లక్ష్య మొక్కటి యగుటచే వారిలో తప్పక సంఘటనముండియే తీరును. అట్లే శాస్త్రమర్యాదలను బట్టి యాచార విచారము లందు భేదమున్నను, సద్భావనద్వారా ఐకమత్యము సమ కూడగలదు.

హిందువులయొక్క యవాంతరజాతులు నశించిపోయి నను మహమ్మదియాది జాతులుండనే యుండును. వాటితోడ గూడ మైత్రి పొసగవలసినదే కదా! బుద్ధిమంతులు, స్వధర్మ పరాయణులు, విశ్వసనీయులు నగు హిందూ మహమ్మదీయు లలో నైకమత్యము పొసగిన పొసగవచ్చును. కాని బిల్లును బట్టి శాస్త్రధర్మ విశ్వాసము లేక, స్వధర్మపరాయణత లేక, నొకవిధమగు విశ్వాసము లేకయు నుండు హిందువులలో పారస్పరికముగ నైకమత్యము కుదురుటసంభవమై పోవును. తండ్రికొడుకులకు, అన్న చెల్లెండ్రకు, భార్యాభర్తలకు కేసులు దావాలు మొదలగునవి బయలుదేరుటే యీ బిల్లు యొక్క ముఖ్యఫలితము.

హిందూకోడును ప్రజలు కోరుచున్నారని చెప్పబడు చున్నది. కాని యది వాస్తవము కాదు. దాని నెవ్వరును గోరుటయు లేదు. 'హిందూలా' కమిటీవారు దేశమందలి యన్ని ప్రాంతములందు బర్యటన జేసి యనేక సంస్థలను, ఆచార్యులను, విద్వాంసులను, జడ్జీలను సాక్షులగా బెట్టుకొని 'చాలమంది జను లీబిల్లు నాక్షేపించినవారు ఉన్నారు' అని స్పష్టీకరించినారు. పట్నాహైకోర్టుజడ్జిగారగు శ్రీద్వారకానాథ మిశ్ర గారు 'ఈ బిల్లును కోరువారెవరు లేరు. దీని యవసరమును లేద'ని నొక్కి వక్కాణించియున్నారు.

'వర్తమాన ధారాసభకు హిందూకోడువంటి బిల్లుల దయారు చేయునధికారము కలదనియు, విధానముల (రూల్సు నియమములు) వంటి మహత్త్వపూర్ణ వస్తువులను దయారు చేయు నధికారముండగా నీసభ హిందూకోడువంటి యుప యోగకారి యగు వస్తువు నేల నిర్మించకూడదు ?' అని చెప్ప బడుచున్నది. కాని యీ చెప్పుటెంతయు నసమంజసముగ నున్నది. విధాన నిర్మాణార్థమై యీసభ యేర్పరుపబడినది. అది విధాననిర్మాణము చేయవచ్చును. కాని హిందూకోడు ద్వారా ధార్మిక విప్లవమును జెలరేగజేసి ధర్మము విషయములో జోక్యము కలుగజేసికొనుట కెట్టి యధికారమును లేదు. డాక్టరు కైలాసనాథకాటజూ, శ్రీ కన్హయ్యాలాల్ మాణిక లాల్ మున్షీ, శ్రీ పట్టాభిసీతారామయ్య, శ్రీ అనంతశయనం అయ్యంగారు, డాక్టరు రాజేంద్రప్రసాదు వంటి విద్వాంసులు

కూడ హిందూకోడువంటి వస్తువును దయారుచేయుటకు ధారాసభ కెట్టి యధికారమును లేదు' అని స్పష్టీకరించినారు.

లోకతంత్ర దృష్టిచే కొలది జనుల యాలోచనలను బహుసంఖ్యాక జనుల నెత్తిన బడవేయు టెంతయు నసమంజసము. దేశములో నూటికి తొమ్మందుగురు హిందువులు వోటు చేయగా ధారాసభ యేర్పడినది. దేశీయరాజ్యము లందలి ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధి యొక్కడును ఇందు లేడు. అట్టియెడ నీ ధారాసభచే నిర్మింపబడిన బిల్లు హిందూదేశమం దంతటను ఎట్లు చెల్లును? లోకమత సంగ్రహణముచేయు కమిటీవారుకూడ "జనులు హిందూకోడుకు వ్యతిరిక్తముగ నున్నారు' అని స్పష్టీకరించియే యున్నారు కదా! అట్టి స్థితిలో పట్టిన పట్టును విడువనని కూర్చొనుట ఈ ధారాసభ కేమి సముచితముగా నున్నది?

కొంతమంది జనులిటు లందురు—''నేడు స్త్రీలయెడ జాల యన్యాయము జరుగుచున్నది. విధవాస్త్రీల దుర్గతి చెప్పనలవి కాకయున్నది. దత్తుని తల్లి యనుభవించుపాట్ల కంతము లేకున్నయది. భర్తలుగల స్త్రీలుకూడ తమ భర్తల వలన నెన్నియో పాట్లకు లోనగుచున్నారు. లక్షలాదిరూపాయలను గడించి మరణించినవాని భార్యకు ధర్మనిమిత్తముగను, తీర్థయాత్రల నిమిత్తముగను కావలయు ధనముమాట యెటులున్నను, సముచితమగు భోజనము బట్టకూడ లభించుట లేదు. ఒకొక్కక్క స్త్రీ సంవత్సరమున కొక్క పంచి

తోడను 10 లేక 20 రూపాయలతోడను కాలము గడవు కొనుచున్నది. పురుషులు వారియిష్టము వచ్చినటుల ప్రవర్తించు చున్నారు.'' పైవిషయము లన్నియు నాపాత రమణీయముగనే యున్నవి. కాని అన్ని సమాజములందు స్త్రీ పురుషులలో మంచివారు, చెడ్డవారు నిరుతెగలవారు నుందురు. పురుషులలో మంచివారును ఉన్నారు. స్త్రీలలో చెడ్డవారు నున్నారు. దోష ముకేపక్షమున లేదు. దోష మెవరు చేసినను క్షమింప వీలులేదు. వాటిని పోగొట్టుటకు ప్రయత్నింపవలసినదే. కాని దానికి ఉపాయము హిందూ కోడుబిల్లు మాత్రము కాదు. సామాజిక శాసనమువలననే యాదోషములను దూరము చేయవచ్చును. హిందూకోడు సదా ఆఫీసులలోనే ఉండునది. మానవుడు కోర్టులలో ప్రవేశించనంత వరకు అది యేమియు చేయజాలదు. మామూలుగా నిటువంటి శాసనములు కొన్ని నేడును గలవు! విధవా స్త్రీకి భర్తయాస్తి ననుభవించుటకు సంపూర్ణాధికారముండనే యున్నది. పతివ్రతయగు విధవా స్త్రీకి తన భర్త సంపత్తు ననుభవించుటకు పూర్తిగ నధికార మున్నది. పతి యేదేని యన్యాయ మొనర్చిన నేడును దండితుడు కాగలడు. తద్వారా భార్యకు పూర్తిగ భరణపోషణములు ప్రాప్తించగలవు. కాని ఇటుపైన ఆమె కోర్టునకు బోవని యెడల న్యాయమును బొందలేదు. హిందూకోడు ప్యాసయిన మీదటను ఆమెకు న్యాయము లభింపదు. నేడో కోర్టుకు బోయిన న్యాయము లభించుచునే యున్నది. శాస్త్రానుకూలములగు నేకార్యములందు ప్రవర్తిం

చిన స్త్రీపురుషుల నైనను అన్యాయులని చెప్పుటెంతయు నన్యాయము. శాస్త్రము లందరకు హితమును గోరునవి. వాటి నియమములకు లోబడి యుండుటయందే శ్రేయ మున్నది. సమాజమందలి చాలమంది స్త్రీపురుషులు వాటిని పాటించుటయందే యథార్థగౌరవమును భావింతురు. అట్టిస్థితి యందే కొలదిజనుల యాలోచలను బట్టియో శాస్త్రమర్యా దల నుల్లంఘించుట మంచిపని కాదు. జలమువలె మానవు నకు నిమ్నప్రదేశములలో బ్రవహించుట స్వభావము.

ఒక నియంత్రణము లేనిచో నాప్రవహించుటంతయు వ్యర్థమగును. హానికరమగును. ఆ నియంత్రణముకూడ వేద ముల యొక్కయు, దూరమును జూడగల మహర్షుల యొక్కయు విధానముల నియంత్రణమే మేలైనది. 'కర్తవ్య విషయమందు అధికారవాంఛ లెక్కింపబడదగినది కాదు' అను విషయము నందరు సమ్మతింతురు. సతీత్వము, వైధవ్యపాల నము, తపస్సు, మాతృత్వము, ఆదర్శపత్నీత్వము వలన గలుగు గౌరవము సర్వోత్కృష్టమైనది. వీటిని పాటించుటచే శక్తిసామర్థ్యములు తగ్గవు. దినదినప్రవర్ధమానములు కాగలవు. వీటి మహిమమహాలముగ భారతనారి ప్రపంచమందలి స్త్రీలం దఱియందు నాదర్శనారిగ బరిగణింపబడుచు వచ్చుచున్నది. ధనసంపదలనే కాదు. ఆమె దేవతలను కూడ వశమునర్చు కొనగలదు. కాలమును కూడ ధిక్కరించగలదు. పతి పుత్రా దులను మృత్యుముఖమునుండి బయటకు గొనిరాగలదు. ఈవిషయములతోడ స్త్రీకి సంబాధము లేకుండ జేయగోరు

వారు పూర్తిగా ధర్మమును, శాస్త్రమర్యాదలను ఉల్లంఘించు చున్నారన్న మాట. కాని వారికి తమ యధికారవాంఛలను, వ్యసనములను, తత్ప్రేరితములగు దుష్కృత్యములను ఒకరుల నెత్తిని రుద్దుట కెట్టి యధికారమును లేదు. పురుషుల వసధి కారప్రయత్నములనుండి మఱలించుటయు, శాస్త్రముల ననుస రించియే స్త్రీలకు సర్వవిధసౌకర్యములు నేర్పరచుటయు శాసనముయొక్క ముఖ్యకర్తవ్యము. ఏయే లోటులను పూర్తిసేయుటకు, నేయే సౌకర్యములను సంపాదించుటకు హిందూకోడు అవసరమని తోచుచున్నదో, ఆయా విషయ ములను శాస్త్రానుకూల మార్గములను బట్టియే సాధించ వచ్చును. 'ఈబిల్లుమూలమునగ వ్యభిచారము, అనాచారములు వర్ణసాంకర్యము, కలహములు పెచ్చుపెరిగిపోవు' నను విష యమును హిందూకోడు సమర్థకులు కూడ యంగీకరించుచునే యున్నారు. కాని హిందూకోడుకు పూర్వమందు మాత్ర మీవిషయము లన్నియు లేవా? అని వారు వాదింతురు. ఈ విషయము అసత్యదురాచరణములను విడనాడవలసినదని శాసనము జేయుచు నా యసత్య దురాచరణము లంతకు బూర్వము మాత్రము లేవా? అని చెప్పునట్లున్నది.

వాస్తవమున యోగ్యమగు సమాజనిర్మాణముచేయు టవసరము. కాని యది శాసనమువలన బొసగదు. శిక్షణ వలన బొసగును. ప్రస్తుతము జరుగుచున్న మలినోపన్యాస ములను. నాటకములను అరికట్టవలయును, సినేమాలను నిరోధింపవలయును. దుష్ప్రకటనల జరుగనీయ కూడదు.

గ్రామ గ్రామమందు, ప్రతియగ్రహారమందు భారత రామాయణ కథలు జరుగవలయును. సత్సంగము జరుగ వలయును. ధర్మ, విశ్వాసముల నాధారముగ జేసుకొని గ్రామ పంచాయతీలు నెలకొల్పబడ వలయును. అవి గ్రామమందలి ప్రతి కుటుంబమును దృష్టియం దుంచుకొనవలయును. అత్యాచారములు నిరోధింపవలయును. అత్యాచారమొనర్చు వానిని దండింప వలయును. ఆ దండనకూడ సామాజికము కావలయును. అప్పుడే కుటుంబసమస్యలు పరిష్కారము కాగలవు. హిందూకోడు ఈరోగములను నివారించుటకు బదులుగ వాటిని మఱింత పెచ్చరిల్ల జేయును.

కొందఱు హిందూకోడు సమర్థకులతోడ నొడంబడికలకు ప్రయత్నించు చున్నారు. 'కొంత మేము ముందడుగును కొంత వారు వెనుకడుగును వేసినప్పుడు ఐకమత్యము కుదురును. హిందూకోడును కొంతవఱకు సవరించి గ్రహించవచ్చును.' అని వీరి తలంపు. వీరి స్థితియు చాల విచిత్రముగ నున్నది. వీరు ఆస్తికులును కారు. బాగు గోరువారును కారు. కేవలము కీర్తి నార్జించుటకును, నలుగురిలోను దమపేరుండునట్లు జేసుకొనుటకును వీరు యత్నించుచున్నారు. వీరి పలుకు లాస్తికులకు నచ్చవు. దేశహితంకరులకు నచ్చవు. కేవల కలహములను దీసుకొని వచ్చుటకై యిట్టి జయచందులు కార్యరంగము లోనికి గొనితేబడు చున్నారు. వాస్తవమున సనాతనమార్గమున బడిపోవు ఆస్తిక సోదరునికంటె మించిన శ్రేయఃకాముడు వేఱొకడుండునా? ఉన్నాడా? శరీరమందలి

రక్త మపరిశుద్ధమైన లేక చెడిపోయిన దానిని దీసివేయించు కొనుటకుగూడ నాతడు వెనుకడుగు వేయడు. ఏదేని యవయవము క్రుళ్లిన లేక చికిత్సచేయ వీలులేనియెడల నతడా (ఆస్తికుడు) యవయవమును ఖండించి వేయించుకొనుటకు శంకింపడు. అవతారస్వరూపులు, మహర్షులుకూడ మార్పుచేయ వీలులేనిధర్మమును మార్పు ఎవ్వడుచేయును' అనునదేసమస్య. శత్రువు మన దోషరహితములగు శిరోహస్తాదులను దోష భూయిష్ఠములని చెప్పి ఖండింప నెంచినచో, మనము సహింతుమా? మన పవిత్ర రక్తమును దీసివేయించ బూనుకొనిన వాడు శ్రేయస్సును గోరువాఁ డెట్లగును? అతఁడహితమును గోరువాడే. శత్రువే. అట్టివానితోడ నెడంబడిక లేమిటికి? అనాదిసిద్ధములు, నపౌరుషేయములు, పరమకల్యాణకారణములు, శాస్త్రసమ్మతములు, వేదానురూపములునగు వ్యవస్థలకు వ్యతిరిక్తముగ జరుగుచున్న కార్యక్రమమును గుఱించి యొడంబడిక లెట్లు పొసగును? ప్రస్తుత హిందూకోడుబిల్లును ఆంగ్లేయ శాసనకాలమందు 'సర్ సుల్తాను అహమదు' అను మహమ్మదీయుడు స్థాపించియుండెను. యోగేంద్రమండలుడను హరిజనుడు సమర్థించియుండెను. దానినే నేడు డాక్టరు అంబేడ్కరు అను హరిజనమహాశయుడు ఎటులైన ప్యాసుచేయించ జూచుచున్నాడు. అంబేడ్కరుగారికి స్వయముగా హిందూధర్మ మనిన గిట్టదు. ఆయన మనుస్మృతిని నిండుసభలో దగులబెట్టిన ఘనుడు. ధర్మవిరుద్ధముగ బ్రాహ్మణ స్త్రీని బెండ్లాడిన యసహాయశూరుడు. వాస్తవమున నిట్టి

వారికి వేదముల మీదను, వైదిక తపోధనులు, వీతరాగులు నగు మహర్షులయొక్క ధర్మశాస్త్రముల మీదను దాడి చేయుట కెట్టి యధికారమును లేదు.

పైగా సర్వవిధముల చేతను శాస్త్రవిరుద్ధమై ధర్మమును సర్వనాశన మొనర్పనున్న యీ హిందూకోడుబిల్లునకు 'హిందూధర్మశాస్త్ర సంగ్రహము' అను పేరు కూడ పెట్టినారంటే అది యెంతయు ధూర్తత్వము, మూర్ఖత్వము నన్నమాట. "విభిన్న ధర్మశాస్త్ర విషయములతోడ నల రారునట్టిదియు, హిందూసమాజమందలి యన్నివర్గముల వారుకూడ పాటించుటకు దగినదియు నగు నొక క్రమబద్ధమైన ధర్మశాస్త్రసంగ్రహమును నిర్మింపవలయునని ప్రజల కోటికి నానాటికి బలీయమగు చున్నదని" బిల్లుసమర్థకులు చెప్పుచున్నారు. కాని యిది చాల యసంగతవిషయము. హిందూప్రజ లెప్పుడు నిట్టిబిల్లులను కోరుకొనలేదు. పైగా హిందూకోడు నొకభయంకర విపత్తుగా భావించి దానియెడ చాలఘోరద్వేషమును జూపుచున్నారు. హిందూలా కమిటీ వారి రిపోర్టుమూలమునను, డాక్టరు మిశ్రగారి రిపోర్టుమూలమునను ప్రజల ద్వేషభావము సుస్పష్టమగుచునే యున్నది.

"హిందూ సమాజమందలి వర్తమానపరిస్థితులను గమనించుచున్న ప్రతి బుద్ధిమంతుడును 'హిందూధర్మమందు అవశ్యముగ పరివర్తనము జరుగవలసి యున్నది' అనువిషయమును తప్పక అంగీకరించుచున్నవాడే" అని కోడుసమర్థకు

లందురు. ఇది కూడ నేమియు బాగులేదు. పాశ్చాత్యశిక్షణ సభ్యతల కలవాటుపడి, యిష్టము వచ్చినట్లుగ నడచుకొనుచు నుండు యేకొలది చపలచిత్తులకో తమలోగల విషయలోలు పత్వకారణముగను, ఇంద్రియదాస్య కారణముగను హిందూ శాస్త్రములను మార్చుచేయవలయునను బుద్ధి పుట్టును. కాని జితేంద్రియులు,దూరమాలోచించగలవారునగు స్త్రీపురుషులు మాత్రము తపోధనులగు మహర్షుల యుపదేశములను,వేదాది సమ్మతవిధానములనే పరమకల్యాణకారణములుగా భావింతురు. ఈబిల్లు హిందూధర్మశాస్త్రములయొక్క సంగ్రహమని చెప్పుచున్నారు గదా! అట్టిస్థితిలో నిందు నవీనవిషయముల జేర్చుట యేమి సమంజసముగ నున్నది? విశేషముగ నంతర్జాతీయవివాహము, సగోత్రవివాహము.విడాకులచట్టము ఆడుబిడ్డకు దాయభాగము మొదలైనవన్నియు ధర్మశాస్త్రమునకు విరుద్ధమైనవే కదా? ఇందు ఈ విరుద్ధవిషయములన్నియు నేల చేర్చబడినవి? ఏ ధర్మశాస్త్రము చేతనైనా యీవిషయములను సమర్థించవచ్చు నందురా! దాని నేల యెదుట బెట్టుటలేదు ?

వాస్తవముం దీబిల్లువారు మితాక్షరాపద్ధతిని గాని దాయభాగవిషయమునుగాని, వీరమిత్రోదయ విషయమును గాని దేనినిగూడ స్వీకరించలేదు. ఒకచోట నొక కొంత మఱియొకచోట మఱియొక కొంత, వేఱొకచోట వేఱొక కొంతను ప్రోగుచేసి యీబిల్లును భానుమతి సంసారమును కూడబెట్టినట్లు కూడబెట్టినారు. ఈ విధాన మన్నివర్గముల

వారియెడను సమానముగ జెల్లనేరదు. అందఱు రోగులం దఱకు నొకేమందుకాక దేశకాల రోగప్రకృతులనుబట్టి వేఱువేఱు మందు లీయబడుచున్నటులే మనవేదములు, మహార్షులు నందఱకు ననువైన వేఱువేఱు విధానముల నేర్ప ఱచియున్నారు. బ్రాహ్మణుడు రాజసూయమును జేయ వీలు లేదు. క్షత్రియుడు వాజపేయము నాచరింపరాదు. క్షత్రియా దులు వైశ్యస్తోమము నాచరింపకూడదు. ఇట్టిస్థితిలో నందఱి యెడను ఒక్క విధానమెట్లు చెల్లును? జనులెంత యధికముగ నబద్ధమాడుట కలవాటు పడినను, అబద్ధ మెంత యధిక ప్రచారములోనికి వచ్చినను 'అబద్ధమాడవచ్చును' అను విధానముమాత్ర మేర్పడజాలదు. అబద్ధమాడెడు ప్రవృత్తి యెంత యధికమైనను మహత్త్వము సదా సత్యమందే యుం డును. ఇట్లే శాస్త్రవిరుద్ధముగ ఆచరణము చేయవలెననియు, ఇష్టమువచ్చిన రీతిని సంయమము లేకుండ భోజనము చేయ వలయుననియు, ఇష్టమువచ్చినరీతిని పెండ్లి చేసుకొనవలయు ననియు ప్రవృత్తి యెంత యధికమయినను దాని కనువగు విధిమాత్ర మెన్నడు న్యాయము కాకూడదు. అట్లు దుష్ప్ర వృత్తుల కలవాటుపడిన వ్యక్తులను సదాచారులతోడ సమానముగ జూచుటయు, వారి యాప్రవృత్తుల కవకాశము లను గల్పించుటయు ననునది పాపాచరణమునకును, స్వేచ్ఛా చరణమునకును, దోహదమిచ్చుటయే. శాస్త్రవిరుద్ధ జీవన ములు గడపుటకు సౌకర్యములను గల్పించుటనునది, అన్న చెల్లెండ్ర పెండ్లిండ్ల కవకాశము కల్పించుటయు, సారా

బాగుటకు దగుసౌకర్యముల గలుగజేయుటయు నెంత క్షమింపవీలు లేని యపరాధమో. అంతయే క్షమింపవీలు లేని యపరాధము. ఈబిల్లు 'హిందూధర్మశాస్త్రసంగ్రహము' అను నామము నకును, ఇందు హిందూశాస్త్రము లందలి వేర్వేరుశాఖలు సంకలన మొనర్పబడును ప్రతిజ్ఞకు బూర్తిగా విరుద్ధము. ఇందు విభిన్నశాఖలు సంకలన మొనర్ప బడుటకు బదులుగ నధార్మిక విషయములు సంకలన మొనర్ప బడినవి. కావున నీవ్యవస్థకు 'అధర్మసంగ్రహము' అని పేరుపెట్టిన జాల బాగుండును.

మఱియొక విషయము— కోడుసమర్థకులు ఒకచోట "వివాహము, దాయభాగము మొదలగువానికి ధర్మముతోడ నేలాటి సంబంధమును లేదు. ఇది సామాజిక విషయము. అగ్రమునకు జెందిన సమస్య. ఇది మంత్రులు విచారణ చేయ దగు విషయము. ఈ బిల్లు మూలమున హిందూధర్మమున కేమియు హాని కలుగదు. కనుక ధర్మవిషయమున జోక్యము కలుగజేసుకొను చున్నారను విషయమే లేదు." అని చెప్పు చున్నారు. ఆ సమర్థకులే "ఈ బిల్లు పేరు 'హిందూధర్మ శాస్త్రసంగ్రహ' మనియు ఇందు హిందూధర్మశాస్త్రము యొక్క వేర్వేరు శాఖలు క్రోడీకరింపబడిన వనియు, ధర్మ శాస్త్రములోని పురాతన నిగూఢసమస్యలను సరళాతిసరళ ముగ జేయుచున్నా మనియు" బలుకుచున్నారంటే అర్థ మేమయిన ఉన్నదా? దీనిని బట్టి యేవో ధర్మశాస్త్రము

లనుచు హిందువులను మోసములో బడవేయు చున్నారని'' సుస్పష్ట మగుచున్నది.

'భారత దేశమందు నూటికి తొంబదిజనులలో విడాకులచట్ట మమలులో నున్నది' అని కోడుబిల్లువారి వాదము. కాని వారివిషయమున పంచాయతీలవారే బహిష్కార ప్రయత్నములను జేయుచుండగా కచ్చేరీలకు బోవవలయు నాడంబరమంతయు నెందులకు దెచ్చిపెట్టుచున్నారు? ప్రజల సమయమును, ధనమును కోర్టుల వ్యవహారములలో ఖర్చు చేయించుట "అవ్యాపారేషు వ్యాపారః" అనబడదా? జిల్లాజడ్జిగారు వివాహ విచ్ఛేదము ఘోషణ చేసినప్పటికి దానిని దృఢపరచుటకునై కోర్టులకు దప్పనిసరిగా బోవదగు వ్యవస్థ చేయుచున్నారు. కోడుబిల్లు 1 వ భాగము 44 వ ధార (రూలు) 1 వ నియమమందు 'జిల్లా జడ్జిగారు ఇచ్చిన వివాహవిచ్ఛేద సంబంధమగు ప్రతిడిగ్రీని హైకోర్టు ద్వారా దృఢపరచుకొన వలయును' అని స్పష్టముగ వ్రాయబడియున్నది. ఆ విషయము నెక్కువగా బరిశీలనజేయనెంచినను లేక అన్యసాక్ష్యమేదేని తీసుకొననెంచినను హైకోర్టు ఆచేయదగు కార్యక్రమమును దెలియజేయునట. ఆశ్చర్యకరమగు విషయమేమి యనగా, భార్యవద్ద కేసును నడపుకొనుటకు దగుధనము లేకపోయినచో కోర్టు ఆమె జీవనోపాధికై నెల్లకెంతయని యొక కొంతధనమును, కేసులకయిన ఖర్చులను గూడ నామె భర్తచేత నిప్పించునట. ఈవిధముగ నీబిల్లు భర్తయొక్క ద్రవ్యముతోడనే భర్తతోడ కేసును

పోరాడుటకు భార్యకు తగు అవకాశమును కల్పించునట. పాఠకమహాశయులారా! హిందూకోడువారి న్యాయపద్ధతి ఇది. పైగా జిల్లాజడ్జి తరువాతను, హైకోర్టు తరువాతను కూడ అప్పీళ్లు జరుగుచునే యుండగలవు.

వివాహవిచ్ఛేద మయినతరువాత వీరిచే బిడ్డల సంరక్షణ నిమిత్తముగ జేయబడిన యేర్పాటంతయు వ్యర్థము. బాలుర ధార్మికగౌరవమును, నైతికగౌరవము ను నశింపుచేసిన తరువాత వారికి శిక్షణ యేమి జరుగును? రక్షణ యేమి జరుగును? దత్తతయేర్పాట్లను శాస్త్రవిరుద్ధముగ జేసిపెట్టినారు కదా! దత్తకహోమము మనవసరమనియే చెప్పినారు. కాని రిజిస్ట్రీషను మాత్రము ముఖ్యమని చెప్పినారు. ద్వ్యాముష్యాయణదత్తకవిధానమును (సోదరు లిద్దరకు నొకని కుమారుడే కర్మాధికారి యగుట) నిషేధించి శాస్త్రము నావలద్రోసి పెట్టినారు. ద్వ్యాముష్యాయణాది దత్తతవిధానములు శాస్త్రసమ్మతము లయినపుడు వాటి నంతరింపజేయుట యనధికార ప్రయత్నము కాదా! కనుకనే బిల్లువారు "ఈపద్ధతిని బట్టి దత్తత చేసుకొనుటవలన సంపత్తు రెండు కుటుంబములను దాటి యావలకు బోకుండ యుండును. ఒకే వ్యక్తిగాని, కొందఱు వ్యక్తులుగాని సంపత్తును తమ చేతులలో నణచి పెట్టుకొని కూర్చొనకుండుటకై ప్రభుత్వమేదియో యొక యేర్పాటు చేయవలసియున్నదికదా! అట్టిస్థితిలో ద్వ్యాముష్యాయణాది విధానముల నెటులుంచగలము? ఈవిధానములను బట్టి రెండు కుటుంబములవారు కేవలము సంపదను

బంచుకొందుమని మాత్ర మొడంబడిక జేసుకొందురు." అని పల్కుట చాల యజ్ఞానమూలకము నున్నది. ఏలయన శాస్త్రసమ్మతమగు విధానములను బట్టియే సమాజముగాని రాష్ట్రముగాని, ప్రభుత్వములుగాని నడచుకొనవలసియున్నది. ఒక వ్యక్తినిబట్టికాని, సమూహమును బట్టికాని శాస్త్రవిధానములం దాటంకము కలుగరాదు. ఈ శాస్త్రవిరుద్ధ ప్రయత్నమును విడచి సామ్యవాదము నాధారముగ జేసుకొని సంపదలను పంచిపెట్టెద మందురా! అప్పుడీ చేసిన దాయభాగ వ్యవస్థయంతయు వ్యర్థమైపోవును. ఒకయెడ ధనముమీద భర్తకు సంపూర్ణాధికార మున్నదనియు, ఆతనికి సంపత్తు మీద సంపూర్ణముగ దానవిక్రయసత్తాధికారము లుండుననియు జెప్పుచుండగ వ్యాఖ్యముప్యాయణ విధానముగ వత్తిత చేసుకొనుట కధికార మెచటినుండి వచ్చును? బిల్లువారి యీపలుకుల కర్థ మేమున్నది?

మితాక్షరాశాసనమున కాటంకము కలుగుటతోడనే కుటుంబము ఛిన్నభిన్నమగును. మృత్యుకరములమూలమున గూడ ప్రజలుకూడ చాల బాధపడిపోవుదురు. తల్లిదండ్రుల లోను, సోదరులలోను ఐకమత్య విషయమెటులున్నను విడాకులచట్ట కారణముగ భార్యాభర్తలలో సుస్థిరసంబంధము చెడిపోవును. ఇక కుటుంబ జీవనము చాల కష్టమైపోవును. పిమ్మట నందఱు హోటలుభోజనమునకు, హాస్పటలులో మృత్యువునకు అర్హులయిపోవుదురు. ధర్మము నశించుట మూలమున నీతికూడ నశించిపోవును. సత్యము, అహింస,

క్షమ, దయ మొదలగు సద్గుణము లంతరించిపోవును. ప్రాపంచిక వ్యవహారములు జరుగు టసంభవమయిపోవును. వ్యవహారమందుగూడ నెవ్వడు దన పుత్ర మిత్ర భాతృ కళత్రాదులబద్ధమాడుటను కోరడుగదా! తమ మంత్రులు, సేనాపతులు అబద్ధమాడవలెనని యే ప్రభుత్వమైన గోరుకొనునా? అంతియ కాదు. అబద్ధమాడినమీదట ప్రతికూలత కన్పడియా యనృతమాడిన వ్యక్తిని దండించుటకుఁ దగు ఏర్పాటు చేయబడును. న్యాయాధికారులు సాక్షులవలన సత్యభాషణము నాశించిననాడే న్యాయము జరుగగలదు. అసత్యమువలన నన్యాయము, అన్యాయమువలన జెడుశాసనము, జెడుశాసనము వలన నవ్యవస్థయు నేర్పడుట నిశ్చయము. ధర్మబుద్ధి యంతరించగనే లంచగొండితనము, బ్లాకుమార్కెటింగు వృద్ధిపొందుననుటలో సందియము లేదు. బజారులో బహిరంగముగ గేలను 1కి రు. 2-4-0 చొప్పున అమ్మబడు పెట్రోలు బ్లాకుమార్కెటులో రు. 18/- ల చొప్పున అమ్మబడ నారంభించును. ధర్మముతోఁగ సంబంధమే లేనపుడు బ్లాకు మార్కెటింగు ఎట్లు అంతరించును? కష్టపడి పనిచేసినపుడు నెలకు రు. 1000/- లు లేక రు. 2000/- లు వచ్చిన లంచగొండితనము వలన లక్ష రెండులక్షల రూపాయలు మిగుల నారంభించును. ధర్మభయము లేనపుడు లంచగొండితన మెట్లు నశించును? ఈ కోడుబిల్లు కారణముగా మను, యాజ్ఞవల్క్య వశిష్ఠాదులచే నిర్మింపబడిన నియమము లుల్లంఘించబడగా, ప్రస్తుత నెహ్రూగారు, అంబేద్కరుగారు నిర్మించిన

నియమములను మాత్రము త్రోసివుచ్చుట కెంతకాలము పట్టును? ఎంత కష్టము కలుగును? ధర్మముయెడను, ఈశ్వరునియెడను అన్యాయమొనర్చువారికి మంత్రులయొక్కయు, ప్రభుత్వముయొక్కయు కండ్లలో కారముచల్లుట ఒక లెక్కయగునా? పోలీసులు, సైన్యములు, సి. ఐ. డి. లు (గూఢచారులు) ఆ విషయమున నేమియు చేయజాలరు. ప్రజలలో ధర్మబుద్ధి యడుగంటినపుడు పోలీసులు, సైనికులు మాత్రమే యాకాశమునుండియైన నూడిపడుదురా? వారుకూడ నా ప్రజలలోనుండి వచ్చువారే. వారుగూడ పూర్తిగ లంచగొండు లయిపోవుదురనుటకు సందేహము లేదు. అట్టిస్థితిలో చౌర్యము, లంచగొండితనము మున్నగున వెటు లంతరించును? ఒకసారి రఫీ అహామదు కిదవాయి మహాశయు డుపన్యసించుచు 'భ్రష్టాచారములను పోగొట్ట నియమింపబడినవారు కూడ భ్రష్టాచారముల పాలైపోయినారు' అని పల్కినాడు. ఇట్టి స్థితిలో హిందూకోడుద్వారా కమ్యూనిజము బాగుగ ప్రోత్సహించబడు నన్నమాట. ధర్మమునకు, సంపత్తునకు కౌటుంబిక జీవనమునకు కమ్యూనిజమం దెట్లు తావు లేకుండ బోయినదో అట్లే దేశమందంతటనుగూడ తావు లేకుండ బోవును. హిందూకోడుద్వారా సగోత్రవివాహము, అంతర్జాతీయ వివాహము, విడాకులచట్టము నాచరణలోనికి వచ్చిన తోడనే అధర్మప్రవృత్తు లధికమయిపోవును.

కోడుబిల్లు మున్ముందు శాస్త్రములమీద దాడిని సాగించును. కోడుబిల్లు స్వీకరించబడగానే మను, యాజ్ఞ

వర్ణ్యాదుల విధానములు వ్యర్థములు. అనవసరములు నయి పోవును. ఇక ధర్మనాశము తప్పదు గదా! అన్నచెల్లెండ్ర పంపకముల మూలమున సంపత్తు అనేక భాగములుగ విభజించబడి ఛిన్నభిన్నమయి పోవును. అంతమునకు యావత్తు భూమిని సంపదను, రాష్ట్రీకరణము చేయగా (రాష్ట్రమునకు చెందునట్లు చేయబడగా) ఎవ్వనివద్దను ఎట్టుగ వ్యక్తిగత సంపత్తుండదో అట్లే, ఈ విషయమునగూడ జరుగును. ఇట్లు సంపత్తునశించుట నిశ్చితము. ఈ స్థితిలో తిండి, గుడ్డ, వైద్యము, న్యాయము చౌకగా లభించుట కెంతకష్టము కలుగునో వేఱుగ జెప్పనక్కఱ లేదు. ఎప్పటికయిన ధర్మమువలననే సమాజముకాని రాష్ట్రముకాని నిలువ గలదు.

ఎపుడయితే వ్యక్తిగతభూములు, సంపత్తులు నశించి పోవునో లేక రాష్ట్రములో కలుపుకొనబడునో, అపుడు జీవనము కేవలము జడయంత్రమువలె నుత్సాహవిహీనమై పోవును. విశేషధనముకొఱకును, విశ్రాంతికొఱకును విశేష కార్యములు సంపాదించుకొనబడును. ఇంతియగాక యజ్ఞతపోదానాదులు కట్టువడిపోవును. పిమ్మట నొకవేళ నీచంచలురాలగు రాజ్యలక్ష్మి యేవిదేశ శాసనమునకైన ఏ అయోగ్య స్వతంత్ర ప్రభుత్వమునకైన లోబడిపోయినచో, దానిని మునుముందు విడిపించుట అవశ్యక మగును. తన్నిమిత్తముగ నాందోళనాప్రయత్నములు సలుపు టవసరమగును. తన్నిమిత్తముగ జాలడబ్బు ఖర్చు అగును. వ్యక్తిగత భూమియు, వ్యక్తిగత సంపదయు నున్ననాడే ప్రజలు అయోగ్య ప్రభు

త్వము వణగద్రొక్క గలుగుదురు. కాంగ్రెసు కార్యక్రమము లందుగూడ కోట్లకొలది రూపాయలు ఖర్చయిపోయినవి. కనుకనే మజ్దూరు గవర్నమెంటు కంజర్వేటివు దళమును తొలగించ గలిగినది. ప్రజలవద్ద నేసంపదయు లేని పరిస్థితిలో ప్రభుత్వ మేమిచేసినను న్యాయమును, అన్యాయమునుగూడ ప్రజలు తలయొగ్గి అనుభవించవలసినదే. కాని వేఱుదిక్కు లేదు. ఇట్లు రాజనీతినిబట్టి యాలోచించినప్పటికి రాష్ట్రము కుంటిదై పోవును. కనుక ప్రభుత్వము సాధ్యమయినంతవరకు రాష్ట్రమందలి వ్యక్తిగత జీవనములందు, సామాజిక, ధార్మిక జీవనములందు చాల తక్కువ జోక్యము కల్గించుకొన వల యును. రాష్ట్రము యొక్క భూమినంతను ప్రభుత్వము చేత బెట్టుటనునది తమ కాలుసేతుల ఖండింపజేసుకొనుటతో సమానము.

ఇట్లే శిక్షావిధానమును (విద్యను) గూడ ప్రభుత్వము చేతులలో బెట్టకూడదు. శాసకు లొకప్పుడు, ఆ స్తికులు, వేఱొకప్పుడు నా స్తికులు నగుచుందురు. వారు వేర్వేరు విధ ములతో శాసనక్రమములను నడపవచ్చును. దాని కనుకూల ముగ రాష్ట్రనిర్మాణము నపేక్షింతురు. ఆ రాష్ట్రనిర్మాణమున కనువగు శిక్షాపద్ధతి నమలుజరుప జూడవచ్చును. తన్మూల ముగ రాష్ట్రమందలి సంస్కృతి, సభ్యత, గౌరవము పూర్తిగ నడుగంటిపోవును. భారతదేశములో నేటివరకు నడచుచున్న శిక్షావిధానమునకు కారకులు ఆంగ్లేయులు. ఈ యాంగ్లేయ శిక్షావిధానమందు భారతదేశముయొక్క చరిత్ర, సాహిత్యము

కూడ పాడుచేయబడినవి. ఆర్యులు ఉత్తర ధ్రువమునుండికాని పశ్చిమోత్తర ఆసియానుండి గాని వచ్చియున్నారని నిరూపించుటకు వీరు ప్రయత్నించియున్నారు. వేదములు గొల్లల గీతములనియు, రామాయణ, భారతాదులకు ప్రమాణ మెద్దియు లేదనియు నిరూపింప బ్రయత్నించినారు. ఇందు మూలముననే ఆర్యులు తమయింట గూర్చొనియుండియు విదేశీయులైపోయినారు. వీరు తమను, తమ పూర్వీకులను హీనులని భావింపదొడంగిరి. తమ సంస్కృతి, సభ్యతలను గూడ హీనముగ భావించి, యత్యంతము గ్రుడ్డితనముతో నితరుల ననుకరింప మొదలిడిరి. ఈకారణముచేతనే దేశమంతయు ఖండఖండములు కావలసి వచ్చినది. 'భారతదేశ మేదియో పంచాయతీస్థానమనియు, ఇది వారి వంశపారంపర్యముగ వచ్చుచున్న ధనముకాదనియు, ఇందు బయటనుండి మహమ్మదీయు లెట్లు వచ్చియున్నారో, అట్లే యార్యులును వచ్చియున్నారనియు నేవేవో భావము లిచ్చటి ప్రజల మెదడులలో గడ్డకట్టుకొనిపోయినవి. పైగా నీదేశము ఎట్లుగ మనదో, అట్లే వారిదికూడ నట. 'వీరికి, వారికి పడనప్పుడును, వీరు, వారు కలసిమెలసి యుండుటసంభవ మయినపుడును దేశమును ఖండములుగ జేసుకొని యెవరి భాగమును వారేల దీసుకొనగూడదు ?' అను నిటువంటి దురాలోచనలకు ఫలరూపముగ దేశము విభజింపబడి పాకిస్తాను ఏర్పడినది. లక్షలాది స్త్రీపురుషాదులు చంపబడినారు. లక్షలాది జనులు ఇల్లు, వాకిలి లేక శరణము! శరణమంటూ తిరుగవలసి

వచ్చినది. ఈతప్పుడు ఇతిహాసము నశించినంతవఱకు, సముచితముగు నితిహాసము నాచరణలో బెట్టనంతవఱకు నింకను నెన్ని యనర్థములు జరుగునో చెప్పజాలము.

ఇదే విధముగ ధార్మికవిషయములలోను, సామాజిక విషయములలోను ప్రభుత్వము జోక్యము కలుగజేసుకొన నిచ్చినవో డా ప్రభుత్వ మేదేని నాస్తికపథము ననుసరించుచు ధర్మమును ద్వేషించునది యైనచో సర్వవిధములచేతనుగూడ ధార్మిక, సామాజిక నియమముల సమూలనాశనము చేయును. జౌరంగజేబువంటి శాసకులే నియములనుజేయ నారంభించినచో నేడిచ్చటను నామమాత్రమునకైన దేవాలయములు లేకుండ బోయెడివి. శిఖా యజ్ఞోపవీతములుకూడ నుండెడివి కావు. ఈ కారణముచేతనే మహర్షులు శిక్షావిధానమును, సామాజిక, ధార్మిక నియమములను ప్రభుత్వము చేతులలో బెట్టలేదు. కనుక శాసనము మారినను శిక్షాపద్ధతి మాత్రము మార్పుజెందదు. ధార్మిక, సామాజిక నియమములు మార్పు జెందవు. తన్మూలమున రాష్ట్రము తన బుద్ధిచేత దానాలోచించుకొని తన ధర్మ, కర్మాదులను రక్షించుకొన గలుగును. ఏ రాష్ట్రమయినను భౌతిక పారతంత్ర్యమును భరించగలదు. కాని యాధ్యాత్మిక, మానసిక పారతంత్ర్యమును మాత్రము భరింపజాలదు. ఒక వ్యక్తికి బేడీలు వేయుటచేతను గూడ మస్తిష్కమును పాడుచేయుటవలన గలుగు కష్టము కలుగదు. క్లోరోఫారమును వాసన చూపి వ్యక్తిని స్మృతిహీనునిగా జేయుట చాల హానికరము. పరముఖాపేక్షగల శిష్యుడు,

నుపాధ్యాయుడు కూడ స్వతంత్రులు కాగోరుట లేదు. వారి యనుసంధానమంతయు నితరుల యాజ్ఞలమీద నడచుచున్నది. వారు స్వతంత్ర సంకల్పములు కలిగి యుండ లేకున్నారు. భాగవతమందలి చండామార్కులువంటి పరాధీనోపాధ్యాయులు 'స దీనో రాజసేవకః' అనియె భావింపబడుదురు. ఈ దృష్టిచేత శిక్షణపద్ధతిని, ధర్మములను, ధార్మిక సామాజిక నియమములను ప్రభుత్వము వారి చేతులలో బడనీయకుండుటెంతయు నవసరము. హిందూకోడు ఈ మూడింటిని తప్పక నాశమొందించును. ఫలరూపముగ కమ్యూనిజము బాగుగ ప్రబలిపోవును.

కొందఱు జనులిట్లు లనుచున్నారు. — "తాము హిందూకోడు యెడ ద్వేషమునే చూపుచున్నారు. కాని మీ హితమును మీరేమియు జూచుకొనుట లేదు. ప్రస్తుత హిందూకోడు మీ కిష్టము కానిచో మీకు ఏ కోడుబిల్లు ఇష్టమగునో మీరే చెప్పండి! నేడు ఏదియో యొక క్రొంత వ్యవస్థ చేయనిదే కార్యక్రమము జరుగజాలదు గదా! కనుక మీ కిష్టమైన కోడును జెప్పి మీపక్షమునే నిలువబెట్టుకొనండి! ఉచితమని తోచిన ప్రజాప్రభుత్వము దానిని గురించియే విచారణ జేయగలదు." దీని నాధారముగ జేసుకొనియే కొందఱు స్త్రీలు, పురుషులు క్రొత్త కోడుబిల్లు నిర్మాణమునకు సంసిద్ధులు కాజొచ్చినారు. కాని యీవిషయమున మేము ఇంతమాత్రమే సమాధాన మిచ్చెదము. ఏమని యనగా, "ఇప్పటివరకు నొక సాంగోపాంగ వ్యవస్థ నడచుచు వచ్చు

చున్నది. దానికి బదులుగ వేఱొక నవీన వ్యవస్థను జేయవలసిన యక్కఱ లేదు. ఒకడు ఒకని ఇంటిని కూలగొట్ట నారంభించగా మనముకూడ వెళ్లి యా గృహమును వేఱొక విధముగ గూలద్రోయ బూనుట ఉచితమును కాదు. అవసరమును లేదు."

ఈ కోడుబిల్లు మూలమున పారంపర్యముగ వచ్చుచున్న యనేక హిందువుల విశేష విషయములు అంతరించును. దీనిద్వారా హిందువులు మహమ్మదీయులుగను, క్రైస్తవులుగను జేతపోయబడుదురు. వివాహ ప్రకరణములో ప్రతి హిందువును పెండ్లి చేసుకొన నవకాశమీయబడినది. ఈ కారణముచేత వర్ణవ్యవస్థయంతయు చెడి వర్ణసాంకర్య మేర్పడును. ప్రాచీన వ్యవస్థనుబట్టి కౌటుంబిక జీవనము, సంపత్తు స్థిరముగ నుండెడివి. ఈ కోడుబిల్లునుబట్టి ఆడుబిడ్డలను భాగస్థులగను వారసులనుగను చేయుటమూలమున సంపత్తంతయు ఛిన్నభిన్నమై పోవును. 10 ఏండ్లలోపుననే సాధారణకుటుంబీకుల యిండ్లు, పొలములు నమ్ముడై పోవును. ఆడుబిడ్డ యత్తవారింటికి పోవుచు దనభాగమునకు వచ్చిన యింటిని, పొలమును అమ్ముకొనిపోవగలదు. ఆమె యెక్కువ ధనమునకు లోభపడి అన్యమతస్థులకు కూడ అమ్మివేయగలదు. ఒకే యింటియందును, యింటింటను, భర్తయొక్కయు, సోదరునియొక్కయు నింటిలోను హిందుస్తానము, పాకిస్తానము నేర్పడును. సోదరగృహమందును, భర్తృగృహమందును కురాను చదువబడును. గోమాంసము వండబడును. వేదపాఠహోమా

దులుగూడ నంభవించును. వాస్తవమున భార్యాభర్తల యొక్క జీవన మొక్కటి కదా! కనుక కోడలు తనతండ్రి యింటనుండి యెంత యాస్తిని దెచ్చుకొనివచ్చునో, అంత యాస్తిని లేక అంతకంటె నెక్కువ యాస్తిని యాడపడుచు తన యత్తవారింటికి గొనిపోవును. లాభమేమియు లేకపోగా సోదర బావమరదులలో గలహములు బయల్వెడలును. కేసులు, దావాలు నధికమగును. తక్కువ యాస్తి లభించి నను తండ్రి యప్పులోని కొంతభాగము తనమీద బడినను ఆడుబిడ్డకు పెండ్లియగుట కష్టమయి పోవును.

ఇప్పటి సాధారణస్థితిలో తండ్రి లేక సోదరుడు తమ భార్యల మెడలలోని నగలనైన అమ్మి యప్పులు తీర్చి తమ యాడుబిడ్డకు (సోదరి గాని, కుమార్తెగాని) మంచి యింటిని, మంచి వరుని జూచి పెండ్లి చేయుచునేయున్నారు. తరచుగా తమకంటె నుచ్ఛస్థితియందున్న గృహమును వెదకి యచట తమ సోదరికి, కుమార్తెకు బెండ్లి సేయుచున్నారు. పితృ కుటుంబముకంటె నత్తవారి కుటుంబము అధికస్థితిగలది యని అనుకొనదగు నుదాహరణము లెన్నియో కలవు. బిల్లు ప్యాసయిన తరువాతనూ ఆడుబిడ్డలు స్వయంవరము జేసుకొన వలసివచ్చును. వివాహము దూరదృష్టితో కూడినది కాక కామమే కారణముగ గలదియగును. ఆస్తులయందలి యాశ గొలది నాడువారిమీద నెన్నెని యత్యాచారములు జరుగ గలవు. నేడు సంపత్తు లేకుండగనే గూండాలు అబలలను బాడుచేయుచున్నారు. సంపత్తునందలి లోభముచేత నికముం

ధింకను నధికముగ నబలలమీద నత్యాచారములు జరుగును. తండ్రి జీవించియుండగనే తనభాగమును తాను దీసుకొని వేఱయిన పుత్రునకు తండ్రి మరణానంతరము ఆతని యాస్తిలో భాగము లభించవలెనని భావించిన మిగిలిన కుమారులయెడ జాల ఘోరతరమగు నన్యాయము జరిగినట్లే. కన్యాదాన ముత్తమోత్తమమైన దానము. వివాహమందు దానముతో బనిలేదని భావించుటకూడ జాల పొరబాటు. స్త్రీ పురుషు లిద్దఱు నొక్కరే. ( భార్యాభర్తలు ఇరువురు నొక్కటే ) వారిద్దఱకు స్వార్థ మొక్కటే. జీవన మొక్కటే. వారిద్దఱిలోను వేఱువేఱు స్వార్థములను గల్పించుటనునది కలహమునకు విత్తువేయుటయే.

బిల్లు సమర్థకులు చెప్పునదేమనగా, "తండ్రి యాస్తి మీద నధికారము వచ్చుటతోడనే యాడుబిడ్డల నిమిత్తముగా నడచుచున్న కట్నముల యాచార మంతరించునట. స్త్రీకి దైన్యస్థితి యుండదట. తండ్రి ధనమం దధికారముండుటచేత నత్తవారింట దాసురాలై పడియుండనక్కఱలేదట. ఇంతకు పూర్వము స్త్రీ ధనకుబేరులవంటి సోదరులుండియు డబ్బుకొఱకై యొరులమీద నాధారపడి యుండవలసివచ్చుచున్నదట. ఆడుబిడ్డ భాగ మాడుబిడ్డకీయకుండ అన్యాయమునకు పాల్పడు సోదరునిమీద నామె కేసు పెట్టుకొనవచ్చునట." ఆలోచించి చూడగా పైవిషయము లన్నియు గడు సత్యదూరములని సుస్పష్టమగుచున్నది. ధనికుడగు సోదరుడు తన సోదరి కష్టపడుచుండగా జూచి యూరకొనలేడను విషయము

నిజమే. ధనములేనివాడుకూడ భార్యనగలనమ్మి ఋణముల దీర్చివేసి సోదరికై మంచిగృహమును, మంచివరుని వెద కుచునే యున్నాడు. భారతదేశమందు దండలు జనులు కోటీశ్వ రులు, లక్షాధికారులు కారను విషయము, చాలమంది బీద వాండ్రను విషయముకూడ నిజము. తండ్రి మరణించినచో చాలమంది యాడుబిడ్డలకు పెండ్లికైన రూపాయలు మిగు లుటలేదు. వారి గతి యేమి కావలసినది! అను విషయము కూడ నాలోచించదగినదే. పైవిషయములతోబాటు క్రింది విషయములుకూడ నాలోచించవలసినవే. అవి యేవనగా, తండ్రి ఋణగ్రస్తుడైనచో నాడుబిడ్డకు లభించు సంపద్భాగ ముతో పాటు ఒకకొంత ఋణభాగముకూడ లభించునుగదా! వేయి, వేయి రూప్యముల భాగములను పొందిన కన్యకల నెంతమంది పెండ్లాడుటకు సంసిద్ధులగుదురు? మఱియు వేయి వేయి రూప్యముల ఋణభారమును పొందిన కన్యకల నెంత మంది పెండ్లాడుటకు సంసిద్ధులగుదురు? అను విషయము కూడ నాలోచించదగినదే. ఏకొలది రూపవతులగు స్త్రీలతో తప్ప మిగిలిన స్త్రీలందఱకు హిందూకోడు హానినే కలిగిం చును. ఇది ధ్రువము.

స్త్రీ తన తండ్రివలన వచ్చిన ధనమును పొలమును బెట్టుకొని స్వతంత్రవ్యాపార, వ్యవసాయముల నారంభిం చినచో నామె కార్యమునకు బుత్రులుగాని, భర్తగాని తోడ్పడు టసంభవమయి పోవును. ఇట్లే పతి, పుత్రాదుల కార్యములం దీమెయు తోడ్పడుట మానివేయును. ఈ

స్థితిలో నిరువురి కార్యములును ధ్వంసము లగును. అహం
కారము, భేదభావము, కలహము మూలమున దాంపత్య
జీవితమును, కుటుంబసుఖమును విషప్రాయమై పోవును.
శ్వశురకులమునకు (మామగారి కుటుంబమునకు) రాణియు,
గృహలక్ష్మియునగు స్త్రీ శ్వశురుల శుశ్రూషను, భర్తృ
సేవను, సరియగు వ్యవహారమును చేసిన నది దాసత్వమన
బడదు. సాధారణముగా పురుషులుకూడ గురుజనుల (తల్లి,
తండ్రి మొ॥ వారు) యెదుట దాసులగుటను తప్పుగా భావిం
పరు. వాస్తవమున నీదాసత్వమే సర్వాధికమైన దైశ్వర్యము
నకు స్త్రీనిగాని, పురుషునిగాని ప్రభువుగా జేయును.

" తండ్రి యాస్తిమీద నాడుబిడ్డల కధికారముండుట
వలన వారి భర్తలు దురాచారులయినను, పునర్వివాహము
జేసుకొన్నను లేక మృతినొందినను వారు తమ దుష్టబంధు
వులకు దాస్యము చేయుచు, అనాచారములద్వారా ధనో
పార్జన జేసుకొనుచు జీవన యాపన జేయనక్కఱలేదు. బిడ్డ
లను నిశ్చింతగా బెంచుకొనవచ్చును. ఆర్థికశక్తి కలుగుట
తోడనే స్త్రీ భర్తవలన, బంధుకోటివలన, కాముక జనము
వలన రక్షణ బొందగలదు" ఇట్లు కోడుపక్షము వారందురు.
కాని ఇదియు నసంగతమే. భర్తృ కుటుంబము యొక్క
సంపత్తు మీదనే స్త్రీ కధికారము విధించబడినది. వివాహా
నంతరము భార్య భర్తృ గోత్రమునకు జెందిన దగును.
'పిండం దత్వాధనం హరేత్' అను వాక్యమును బట్టి
శ్రాద్ధ, తర్పణ, పిండదానాదులు చేయువాడే ధనమున కధి

కారి యగును. సోదరులుండగా సోదరీమణులకు పిండప్రధా నాధికార ముండదు. కనుక వారికి ధనాధికారము కూడ లేదు. కాని భర్త యా స్త్రీయందు మాత్రమామె కధికార మున్నది. దానివలననే స్త్రీ పోషింపబడ వలయును. భర్త తోడనే ఆమె జీవనయాపన జేసుకొనవలయును. వారిలో ఆర్థిక విషయము వేరైన సంబంధమును వేరగును. తన్మూలమున ద్వేషము బయల్వెడలి జీవితము దుఃఖమయమగును. గర్వ మనునది సేవాభావమునకు విరోధి.

పతి, మామ, అత్త, తోటికోడలు, మరది మున్నగు వారితోడ విరోధము సంభవించినపుడు స్త్రీ చేతులలో సంపద యున్న సదాచారముకంటె దురాచారబుద్ధియే మెండగును. స్వధర్మపరాయణురాలు, త్యాగశీలురాలు నగు స్త్రీకి అందఱును నమస్కరింతురు. ఆమె కేవస్తువునకు లోపము గన్పింపదు. దురాచారి యగువాఁ డీమె నీడనైన దాకఁజాలడు. అట్టి సతీమతల్లి కేదేని లోపము గలిగినచో ప్రభుత్వము ద్వారా భర్తృకుటుంబమునుండి యాలోపమును దీర్చ వలయును. భర్తృకుటుంబమున ధనమేమియు లేనియెడల నామెకు తండ్రియో, సోదరుడో తప్పక దోడ్పడుదురు. వారి సాహాయ్యము సంతోషపూర్వకముగ లభించకున్నను శాసనముద్వారానైన ఆమెకు సహాయము కలిగించవలయును.

"బుద్ధిమంతుడైన మనుజు డెవ్వడును దుర్వినియోగము చేయవలసి వచ్చునేమో యను భయముచేతను, తనకే హాని కలుగునేమోయను భయముచేతను శస్త్రాస్త్రములను దనవద్ద

నుంచుకొనడు. అట్లే భర్త చోరుడు, పతితుడు, సన్యాయి యైనచో లేక పునర్వివాహము జేసుకొన్నచో స్త్రీ వైధవ్యము, త్యాగము, తపస్సుతో గూడిన జీవనమును గడుప లేనియెడను, తన మనస్సును నిలువబెట్టుకొన లేనియెడను. బిడ్డలను పెంచుకొనుటకై వ్యభిచారములకు సంసిద్ధురాలగుటకంటె గౌరవపూర్వకముగ పునర్వివాహము జేసుకొను టెంతయు మేలు. విడాకుల చట్టమూలమున నామె కనుకూల వాతావరణము లభించును, పునర్వివాహము వలన కడుపు మంట చల్లారును. యౌవనమందలి యభిలాష లీడేరును. ఈస్థితిలో వివశురాలై యామె సతీత్వమును భంగపరచుకొన నక్కఱ లేదు. భ్రూణహత్యలు, (గర్భస్థ శిశువుల జంపుట) చేయనక్కఱ లేదు. తిరస్కృతురాలై రూపమును అమ్ముకొన నక్కఱయు లేదు." పైవిధముగ విడాకులచట్టమును సమర్థించువారు చెప్పుదురు. కాని పైవిషయములు పైకి మాత్ర మాపాతరమణీయముగనే యున్నవి. కాని కొంత యాలోచించి చూడగా నవికూడ చాలహానిని గలిగించునవి యని తేలగలదు. ప్రపంచమందు పాప, పుణ్యములు సదా జరుగుచునే యుండుననను విషయము నిజము.

కాని యెంతవరకు ధర్మాధర్మ భేదము, పాపపుణ్య భేదము, విధినిషేధ భేదము నుండునో యంతవరకే కొందఱు కాకున్న కొందఱయినను పాప' అధర్మ, నిషేధాదులకు దూరముగానుండ బ్రయత్నింతురు. పైభేదభావము లేనపుడనాచార మార్గమునుండి మఱలుటయే దుష్కరమయి

స్వతంత్రించి సంపద నుపయోగింప నారంభించిన తనకు, తన పరివారమునకుకూడ చాల యనర్థము వాటిలును. అనేక ప్రకారముల పురుషులతోడ సంపర్కమువలన స్త్రీలహృదయ గతులే మారిపోవును. తన్మూలమున సంపత్తు దుర్వినియోగము సేయబడును. ముందుముందు ఇటువంటి వేలాదిచరిత్రలు జరుగగలవు.

స్త్రీ ధనమును స్వతంత్రముగా ఖర్చుసేయవచ్చుననుట కుదాహరణముగా జెప్పబడుచున్న విషయమేమి యనగా, 'స్త్రీ తనధనమును స్వతంత్రించి ఖర్చుపెట్టుకొనవచ్చునను విష యమును స్మృతికారులుకూడ నంగీకరించుచునే యున్నారు కదా! అట్టి స్థితిలో విధవాస్త్రీకి వారసత్వరూపముగ లభిం చిన యాస్తి నామె ఏల వినియోగించుకొనకూడదు? ఆమె కందు సంపూర్ణ స్వతంత్రత యేల యుండరాదు?' ఇదియు సముచితముకాదు. మొదటి విషయము స్త్రీధనము కొలదిగ నుండును. రెండవ విషయము స్త్రీ యెల్లవేళల బరతంత్రురాలని చెప్పబడినది. 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అందుచేతనే యామె తనధనమునుకూడ దుర్వినియోగము సేయ వీలులేదు. కాని భర్త చనిపోయి, ఈమె సంపత్తుకు యాజమాన్యమును వహించి అన్యరక్షకుల యక్కఱలేకయే తన ధనమును తాను ఖర్చుపెట్టుకొనగల స్థితిలో నన్యదురాచారుల సంపర్కమున బడి యీయామె సంపత్తును దుర్వినియోగము చేయవచ్చును. సాధారణముగా నందఱి మనస్సుకూడ చంచలముగనే యుం

మను. పైగా వేదములందు స్త్రీయొక్క మనస్సును విశేషించి చూశాస్త్య మని చెప్పినారు. "స్త్రీణా మాశాస్యం రఘు"

"యద్దేష్టం స్థావరేష్వపి" అను వాక్యము కూడ ముందుముందు సందర్భానుసారముగ వ్యాఖ్యానించబడినది. సౌదాయికాది సంపత్తులో గూడ ముఖ్యముగ చరాస్తిమీద స్వతంత్ర మున్నది. స్థిరాస్థియందుగూడ భర్తృదత్త స్థిరాస్థి యందు స్వాతంత్ర్యమున్నది. కాని యది విపత్కాలమందు ప్రాణరక్షణకొఱకును కుటుంబ రక్షణకొఱకును క్రయవిక్రయ ములు సేయవీలగును. అయినను పరిపూర్ణస్వాతంత్ర్యము నిషేధమే. లేని యుదాహరణము నాధారముగ జేసుకొని వారసత్వపు ఆస్తియొక్క హక్కులనుగుఱించి ప్రశ్నోత్తర సమాచార మెట్లు పొసగును!

ఒకడొక చిన్నవస్తువును సంపాదించుకొన్నాడనగ, యాతడు పెద్దవస్తువునుకూడ సంపాదించునని మనమెట్లు చెప్పగలము! అతడు చిన్నవస్తువును దుర్వినియోగము చేసి నచో పెద్దవస్తువును దుర్వినియోగము చేయనీయరు. సాధా రణముగా స్త్రీకి ధనరూపమున భూషణములో వస్త్రములో, కొలది రూపాయిలో ఉండును. వారసత్వముగా నిల్లు, భూమి, అధికముగ నగలు వచ్చును. కనుక వీటిని సర్దుబాటు చేసుకొ నుట కష్టము. వీటిని దుర్వినియోగము చేసిన హాని కలుగును. కనుక బిల్లును ప్రతిఘటించువారు చెప్పవలసిన విషయమేమి యనగా "స్త్రీ తన ధనమందలి యొకభాగమును రక్షించుకొ

నగలిగి, రెండవ భాగము నేల రక్షించుకొన లేదు? " అను ప్రశ్నకు తావే లేదు. వస్త్రాభూషణములను, రూపాయలను, రక్షించు కొన లేదు? " అను ప్రశ్నకు తావే లేదు. వస్త్రాభూషణములను, రూపాయలను రక్షించుకొనదగు ప్రవృత్తి స్త్రీలలో స్వతస్సిద్ధముగనే యుండును. కాని బాహ్యసంపత్తును సంరక్షించుకొనుట అంత తేలిక కాదు. ఎప్పుడైన స్త్రీకి ధనరూపముగ పెద్దసంపత్తు వచ్చిన దానిని భర్తయో, పుత్రులో సంరక్షింతురు. కేవల పతిపుత్రాదుల సమ్మతిమీద స్త్రీ యాధనమును వినియోగించును. లేదా శాస్త్రానుసారముగ ధర్మము సేయును. పతి పుత్రాదుల సమ్మతి లేనిదే స్వతంత్రించి యన్యపురుషులతో గలసి సంరక్షణ యేర్పాట్లను జేసుకొనుట, ఇచ్ఛవచ్చినటు లింట బయట దిరుగుట, ఇచ్ఛవచ్చిన పురుషులతోడ కలసి మెలసి నడచుకొనుచుండుట, సంపత్తు నిచ్ఛవచ్చినటు లుపయోగించుటయు నెన్నడు స్త్రీకి విధించబడలేదు.

ఇదేవిధముగ నాడుబిడ్డ హక్కుల విషయమున డాక్టరు అంబేద్కరు ప్రతిపాదించిన యాలోచనలు నిరర్థకములు, శాస్త్రవిరుద్ధములును. తండ్రికి పుత్రుడెంత ప్రియుడో పుత్రికయు నంతయే ప్రియురాలు. అయినను అందొకతె నాతడు దానము చేయవలసి వచ్చుచున్నది. వేఱొకరి నింట నుంచుకొనవలసి వచ్చుచున్నది. ఒకరు తన వంశగోత్రాదులను వృద్ధి బొందించి పిండ శ్రాద్ధాదులు చేయుగా, వేఱొకరన్యగోత్రములలోనికి బోయి సర్వము చేయవలసి వచ్చు

చున్నది. ఇందుచేత నిరువురి వాక్యములలోను భేదమున్నది. ఆడుబిడ్డ వాక్యముల విషయమున స్మృతులను ఉదాహరణగా గ్రహించుటవలన తాత్పర్యము తెలియలేదను విషయము సుస్పష్టమగుచున్నది. ఈవిషయ మీగ్రంథమందే యన్యత్ర విశదముగ విమర్శించబడినది. 'శాసనముద్వారా రూఢి బలీయముకాగల' దని ప్రివీకౌన్సిలు చెప్పిన తీర్మానము బాగుగనే యున్నది. కాని యారూఢి శాస్త్రవిరుద్ధము కాకూడదనియే యందలి భావము. శాస్త్ర సమ్మతమైన రూఢియు, ప్రాచీనులు, శిష్టులు నాచరించుచు వచ్చిన యేదేని వ్యవస్థయు భ్రాంతిరహితమగును. నేడు కన్యయొక్క చతుర్థాంశమునకు సంబంధించిన వాక్యముల విషయమున జనులెట్లు పొరబడుచున్నారో, అట్లే వేర్వేఱు శాస్త్రముల భావములను దెలుసుకొనుట విషయమున గూడ బొరబడ వచ్చును. ఇది యొక యావశ్యకదాన మనియు, దాయము మాత్రము కాదనియు, మూల వచనములను బట్టియే తెలియుచున్నది. ఒక సోదరుడు స్వతంత్రుడగు తన వేఱొక సోదరునకు దన యంశమున గొంత దానము సేయుడనియు, సోదరుడు తన యంశమునుండి కొంత భాగమును దన సోదరి పెండ్లి నిమిత్తమై ధర్మము సేయుననియు నీ మొదలుగాగల విషయములన్యత్ర విశదీకరింపబడినవి. ఇంతియగాక సంపత్తు నశించుట, మనస్సు పాడగుట మొదలుగాగల యనర్థములు జరుగగలవని కూడ స్పష్టీకరింప బడినవి.

పోవును. అనురాగవశమున సంపాదించుకొనిన వస్తుప్రసంగము నిషేధ భావము, దురాచార భావము, అధర్మ భావము నడుగంటుటతోడనే విధాన భావము, సదాచార భావము, ధర్మ భావము బయల్వెడలును. పిమ్మట దానిని మఱలించుట మనకు శక్యము కాదు. "యద్వ్యాక్యతో ధర్మ ఇతీతరస్థితోన మన్యతే తస్య నివారణం జనః" "స్వభావర క్తస్య మహాన్ వ్యతిక్రమః" తనవద్ద వస్త్రము నుంచుకొనుటొక విషయము. పాపపు బని సేయుట కవకాశ మిచ్చుట వేరు విషయము. అస్త్రము నుంచుకొనుట అవైధము (తప్పు) కాదు. తన కాలు చేతులను మనుజుడు స్వాభావికముగ నఱుకుకొనలేడు. కాని క్రొత్త క్రొత్త భర్తల ననుభవించ వచ్చునను దలంపుతోడ బురాతన భర్తలను విడచిపెట్టుచు నుండుటయు గష్టము కాదు. కావున భర్తను విడచిపెట్ట వచ్చు ననుకొంతయు హానికారణము. విడాకులు పుచ్చుకొనకుండగను కూడ కడుపుమంటను చల్లార్చుకొనుటకు విధిప్రయుక్తములు అగు నుపాయము లుండవచ్చును. వేశ్యలు కూడ నేదియో యొక సమయమున కడుపుమంటతో బాధపడువారే కదా! అట్టియెడ కేవలమొక్క విడాకుల చట్టమూలమున మాత్రము కడుపుమంట చల్లారునని యెట్లు చెప్పగలము ? సంతోషము లేనపుడు యావనపు టభిలాషలు మాత్రమెటు లీడేరును ? ఎప్పటికైన సద్గ్రంథ పఠనమువలనను, ఇంద్రియ జయము, పవిత్ర వాతావరణము, భజన ధ్యానాదుల వలనను చిత్తము శాంతిని బొందగలదు. స్త్రీ పురుషుల ప్రకృతులు వేరు. స్త్రీ

రక్షణమువల్లనే వంశ, గోత్రాదులు నిలుచును. స్త్రీక్షేత్రము పాడగుటతోడనే అన్ని విషయములు పాడగును. కనుకనే స్త్రీలు పురుషులకంటె నూరు రెట్లధికముగ బూజింపబడదగినవారు. లజ్జా శీలములే స్త్రీలలోని విశేషములు. కావున వారికి పునర్వివాహ మెంతమాత్రము బనికిరాదు.

ఇంతియుగాక విడాకుల చట్టమును స్త్రీ యెటులుపయోగించుకొనునో, యటులే పురుషుడు నుపయోగించుకొనును. స్త్రీలు లజ్జాసంకోచములు కలవారు కావున దీనివలన వారికి చాల తక్కువలాభము కలుగును. కాని చపలచిత్తులగు బురుషులే యీచట్టమును దుర్వినియోగముజేసి యధికలాభమును బొందుదురు. పురుషులు పిల్లలుకల స్త్రీలను, రూపములేని స్త్రీలను, వయస్సు ముదిరిన స్త్రీలను విడచి క్రొత్తక్రొత్త రంభలను వెదుకనారంభింతురు. రూపవతులగు యువతులే యొకటిరెండు మారులో పునర్వివాహమును జేసుకొనగలరు. కాని మిగిలిన రూపములేని సాధారణస్త్రీలు, వయస్సుముదిరిన స్త్రీలు తమ భర్తలు విడచిపెట్టివేయుటచే మఱల నెంత ప్రయత్నించినను రెండవ భర్తను బొందలేరు. వారు రక్తాశ్రువులు గార్చుచు జీవితము గడుపవలసివచ్చును. ఏదియో కొలది చపలచిత్తులగు రంభల నిమిత్తమై చాలమంది స్త్రీల జీవితములు ప్రమాదములకు గుఱియగును. వారి కడుపుమంట (ఆకలిబాధ) అధికమైపోవును. వారి మనోభీష్టముల గతి యేమి కావలయునో పాఠకులే యాలోచించి తెలుసుకొనగలరు.

కోడుబిల్లువారు చెప్పునదేమనగా, 'యుగయుగమం దలి దయా, ప్రేమ, వాత్సల్యములు స్వరూపమును దాల్చి నవా ? యన నొప్పు నారీలలామ తన యధికారములను దుర్వినియోగము సేయుననియు, స్వేచ్ఛాచరణకు దారి తీయుననియు శంకించుట చాల యన్యాయము. సీతా, సావిత్రుల సంతాన విషయమున నిట్లు శంకించుట ఆ పరమ పతివ్రతల నవమానించుటే' కాని మన మించుట నాలోచించ వలసిన విషయమేమి యనగా, కర్తవ్యనిష్ఠా, దయా, ప్రేమ, వాత్సల్యములు రూపము దాల్చినవా యననొప్పు నారీ లలామ తండ్రి యాస్తిని, విడాకుల చట్టమును అపేక్షించునా? ఎంతమాత్రము నపేక్షింపదు. సీతా, సావిత్రి మున్నగు వారిని మార్గదర్శులనుగా తలచి సంపత్తును, విడాకుల చట్టమును గోరుకొను స్త్రీ తనను సీతా, సావిత్రి మున్నగువారి సంతాన మని చెప్పుకొనవచ్చునా ? వారికిందు ఏమైన గౌరవము కన్పించుచున్నదా ? వారు విడాకుల చట్టమువంటి యవ్యవస్థను గోరుకొనగా, దానిని దుర్వినియోగము చేయకుందు రనుటకు మాత్రము ప్రమాణమేమున్నది ?

డాక్టరు అంబేద్కరు మహాశయుడు స్త్రీ సంపత్సమస్య నత్యాశ్చర్యముగ వర్ణించి చెప్పుదురు. కాని శాస్త్ర పరిచయము గల వ్యక్తుల కీవిషయము అత్యంత సుబోధ మగును. స్త్రీ యొక్క వారసత్వపు విధానముల నుల్లంఘించి హిందూకోడు ప్రత్యక్షమందు మను, యాజ్ఞవల్క్యాదుల వచనములను ద్రోసిపుచ్చినది. శాస్త్రములందే సంపత్తు కెవ్వ

డధికారి యని పేర్కొనబడియున్నదో దానికి వ్యతిరిక్తవిధానమును జేయుటెంతయు నధర్మము. స్త్రీ ధనము నాపత్కాలమందొక్క భర్త తప్ప అన్యులెవ్వరును ఖర్చుపెట్టరాదు. ఇందుచేతనే ఆమె యధికారముల విషయముల నధికవిచారణ చేయబడినది. వివాహితయగు స్త్రీ కంటె, వివాహము కాని కన్యకకును, వివాహమైన వారియందు గూడ నప్రతిష్ఠితా స్త్రీ లకును ప్రథమాధికారము భావింపబడుచున్నది. 'అనేకమంది రోగుల కొకేమందు' వంటి వ్యవస్థయే అవ్యవస్థ యనబడును. గాని మను, యాజ్ఞవల్క్యాదుల వ్యవస్థలు శాస్త్రీయములు కావున నవ్యవస్థలు కాజాలవు. రోగులందఱకు నొకే చికిత్స నేర్పరచువా డజ్ఞానియగును.

కాని బుద్ధిమంతుడు కాడు. స్త్రీ పురుషుల ప్రకృతి, యోగ్యతలం దధికభేద మున్నది. స్త్రీలలోగల గర్భధారణ, సంతానపాలనాది తత్త్వములు పురుషులలో లేవు. పురుషుని యందుగల కాఠిన్యగుణము స్త్రీయందు లేదు. పురుషుడార్జన సేయును. స్త్రీ ఆయార్జనమును గృహమందు సముచితముగ నుపయోగించును. పురుషునిది బాహ్యక్షేత్రము. స్త్రీది గృహక్షేత్రము. కనుక స్త్రీ సదా పురుషుని నియంత్రణమందే యుండవలయునని విధించబడినది. తండ్రి యాజ్ఞానుసారముగనో, పుత్రుని యాజ్ఞానుసారముగనో, భర్తయాజ్ఞానుసారముగనో స్త్రీ తన ధనమును ఖర్చుసేయగలదు. స్త్రీ

నేడు కొందఱు జనులు ధార్మిక, సామాజిక నియమ
ముల విషయమున విప్లవములు జెలరేగఁజేయుట వీరత్వము,
గర్వించదగు విషయమునని భావించి 'బహువివాహ ప్రతి
షేధము విధవావివాహ ప్రతిషేధము మన సభ్యత నంతను
మంటగలిపినద'ని పలుకుచున్నారు. 'ఇదియంతయు వారి
స్వకీయగౌరవమునుమఱచిపోవుటయొక్క దుష్పరిణామమేకాని
వేఱొండు కాదు'అని యింతమాత్రమే దానికిసమాధానము.
ఏదేని వస్తువు మంచిదా? చెడ్డదా? యనుసమస్య ప్రమాణము
వలన బరిష్కారమగును. కాని ప్రపంచమువలన గాదు.
సభ్యుడన నెవరు? "సభాయాం సాధుస్సభ్యః" ఈ వ్యుత్పత్తిని
బట్టి సభయందు సాధువైనవాడు సభ్యుడనబడును. లోకుల
సభ యెటులున్న నట్లే యుండలి జనులును సాధువులుగను,
మంచివారుగను బరిగణింపబడుదురు. వేశ్యలసభలో వేశ్యయె
మంచిదని భావించబడును. కాని యావేశ్యయే పతివ్రతామ
తల్లుల సభయందు మంచిదని యెట్లు పరిగణింపబడును?
కోటు, బూటు, హేటులను ధరించి భోజనము చేయువారికి,
కాలుసేతులు కడుగుకొని, పట్టుబట్ట ధరించి, పవిత్రస్థానమున
గూర్చొని భోజనము సేయువారసభ్యులుగనే దోపవచ్చును.
కాని వాస్తవమునకిది సభ్యత కాదు. ప్రామాణికుల సభయే
వాస్తవమున 'సభ' యనబడ దగినది. అందలి ప్రామాణికులే
సభ్యులు. శాస్త్రానుసారముగ నడచుకొనువారే సభ్యులు.
ఇచ్చవచ్చినట్లుగ నడచుకొనువారు సభ్యులునుకారు, నరులును
గారు. వారు కేవలము వానరులే.

"మతయో యత్ర గచ్ఛన్తి తత్ర గచ్ఛన్తి వానరాః
శాస్త్రాణి యత్ర గచ్ఛన్తి తత్ర గచ్ఛన్తి తేనరాః."

ఇచ్ఛవచ్చినట్లుగ నడచుకొనువారే వానరులు. శాస్త్ర సమ్మతముగ నడచుకొనువారే నరులు. నేటి సభ్యులదృష్టిలో వివాహముకూడ నసభ్యమే కావచ్చును. హోమాదులు సేయుట, మంత్రముల జపించుట, ప్రదక్షిణములు సేయుట, కన్యాదానము సేయుట లేక గ్రహించుట— ఇది యంతయు నాధునికదృష్టియం దసభ్యతాలక్షణమే కావచ్చును. శాస్త్రముల ననుగమించువాడే యీ విషయములను దెలిసుకొనగలడు. అతని దృష్టికి శాస్త్రసమ్మతమగు నవివాహము, వివాహము, బహువివాహము మున్నగునవన్నియు సభ్యత్వ చిహ్నములుగనే కన్పట్టును.

హిందూకోడువారు శాస్త్రీయవివాహమందు ఒక్క సప్తపదియె కాక కన్యాదానము, లాజహోమము కూడ అవసరములేదని చెప్పినారు. అవి లేకున్నను కేవల సప్తపది మాత్రముననే వివాహముచితమని తలపబడునట. ఇది కూడ శాస్త్రముల పేరట శాస్త్రములమీద దాడిసేయుటయే. శాస్త్రీయ వివాహములను రిజిష్టరు చేయించుటవలన నవి యపూర్ణములని సిద్ధమగును. ఇందులకై వ్యయముకూడ నధికమగును. సివిలుమేరేజి యాక్టుప్రకారము శాస్త్రములను పూర్తిగ ద్వేషించువాడుకూడ శాస్త్రములను విశ్వసించు వానితో సమానముగ భావించబడును. అట్లు భావించనివా డితరశాసనముల ప్రకారము దండనపాత్రుడగును. విధవా

వివాహ విషయమున మాత్రము సంరక్షకుల యనుమతికూడ తీసుకొనుటవసరమని భావించబడినది. విధవాస్త్రీ తన యిచ్ఛ వచ్చినవానిని పెండ్లాడవచ్చును. నేటి సాధారణస్థితిలోనే రిజిస్ట్రేషను లధికముగ నున్నవి కదా! బిల్లు శాసనములోనికి రాగానే ప్రతివ్యక్తియు లెక్కలేనన్ని వివాహములను, లెక్కలేనన్ని విడాకులచట్టపు ఏర్పాట్లను రిజిస్ట్రేషను చేయించుకొనవలసి వచ్చును. గుమాస్తాల యొక్కయు, నాఫీసర్ల యొక్కయు నావశ్యకత హెచ్చయి ప్రజల ధన మంతయు ననవసర కార్యక్రమములం దధికముగ ఖర్చయి పోవును. దీనికే 'అవ్యాపారేషు వ్యాపారః' అనిపేరు. ప్రతి వ్యవహారమందు కోర్టుల శరణము తప్పకపోగా, ప్రజలీ లా గ్రంథములను జదువుటకు దగుధనము, సమయము మాత్ర మేల ఖర్చుకాదు? కాని యొక విషయమేమన, ప్రజలు చాల భాగము చదువురానివారు. రెండవ విషయమేమన వారి చాల సమయము ఉప్పు, మిరపకాయులను సమకూర్చుకొనుట లోనే ఖర్చయిపోవును. ఇక వారికీ లా గ్రంథములను జూచు కొనుట కవకాశ మెక్కడ చిక్కును? ఆస్థితిలో ప్లీడర్ల, బారిష్టర్ల కడుపులు బాగుగ నిండునన్న మాట. ఈస్థితిలో గూడ 'కేసులను, దావాలను తగ్గించుటకై కోడుబిల్లు అవస రము'. అని పలుకుచున్నారంటే అంతకంటె నాశ్చర్య మేమున్నది? 'కి మాశ్చర్య మతః పరమ్?' పైగా నిటువంటి లంచగొండితనపు కాలములో కోర్టులద్వారా న్యాయమును మన మెట్లు లపేక్షించగలము?

ఎవరండైన సివిలు మేరేజి విషయమున కేసు పెట్ట దలచిన యెడల కోర్టులో సర్టిఫికెటు తీసుకొని వివాహ రిజిస్ట్రారు కివ్వవలసి వచ్చును. తీర్పు జరుగునంతవరకు వివాహము పూర్తికానట్లే తలపబడును. ఈవిధముగ చిన్న చిన్న విషయములందు కోర్టువారికి బాగుగ లాభము కలుగును. వివాహము సంపన్నమగుటకు మిగిలిన విషయము లన్నియు నప్రధానము లగును. వివాహ రిజిస్ట్రారు, ముగ్గురు సాక్షులు మాత్రమే ప్రధానమగుదురు.

తరచుగ నాస్తికుల విషయమున నేవేని ధార్మిక నియమము నేర్పరచుటకే కాక శాస్త్రవ్యవస్థ నేదేని నవలంబించవలసి వచ్చినప్పుడుకూడ నాచరణశీలురగు ధర్మాత్ముల ద్వారా అవలంబించుట జరుగుచున్నది. వ్యవస్థ చేయువాడు రాగద్వేషములకు లోనై స్వార్థమును సిద్ధింపనెంచుకొనినచో నాతడు వ్యవస్థ చేయదగనివాడని భావింపబడు చున్నాడు. కొలది దినములనుండి మాత్రము పరిస్థితి యెట్లు మారిన దనగా నేదేని శాస్త్రవిరుద్ధ విషయము జరుగగనే దానినాధారముగ జేసుకొని దానికనుకూలమగు వ్యవస్థ చేయబడ నారంభించినది. అందులకైకూడ శాస్త్రవచనము లన్వేషింపబడుచునే యుండెడివి. కాని క్రొత్త వ్యవస్థలను, క్రొత్త శాస్త్రములను నిర్మింప బ్రయత్నము సేయబడెడిది కాదు. కాని డాక్టరు అంబేద్కరువంటి వ్యక్తి, అంత్యజుడయ్యు బ్రాహ్మణస్త్రీని పెండ్లాడి మహాపాపమునకు పాల్పడిన వ్యక్తి ఇచ్చవచ్చిన రీతిని శాస్త్రమును నిర్మింప నాహసించుచున్నాడు. విశేషముగ

నందఱు తనతో సమానులనుగ జేయు బ్రయత్నించుచున్నాడు. సర్ సుల్తాను అహమదు ఏమి, మోగేన్ద్రమండలుడేమి, రావుసాహెబేమి? డాక్టరు అంబేద్కరు ఏమి!— వీరెవరికిని వాస్తవమున హిందూధర్మమును దాకుటకైన యర్హతయు, నధికారమును లేదు. హిందువులు రామ, కృష్ణాద్యవతారములను, విశ్వామిత్ర, వశిష్ఠాది ఋషిపుంగవులనుగూడ కేవలధర్మపాలకులుగను, రక్షకులుగను మాత్రమే భావింతురు. పరబ్రహ్మయగు బరమేశ్వరునిగూడ బ్రహ్మదేవుని సృష్టికర్తయని తలతురు కాని, వేదనిర్మాతయని మాత్రము తలపరు. కాని యా పరమేశ్వరుడే అంతకు బూర్వమున్న వేదములను బ్రహ్మదేవుని హృదయమందు బ్రకటమొనర్చినట్లు భావింతురు. ఇట్టి స్థితియందు వేదములను, వేదాధారములగు నార్షధర్మగ్రంథములను ఆధారముగ జేసికొని యేర్పరుపబడిన ధర్మములను మార్పుచేయుట కొరకు స్వేచ్ఛాచారియగు వ్యక్తి కధికార మెటులుండును? నేటి శాసకు లధికారగర్వమున కన్నులు గానక నేమి తలచిన దానిని జేయవచ్చును. కాని యంతమందు వార యీశాసనము లన్నియు తగులపెట్టబడకను దప్పదు. చేసిన దుష్కృత్యములకు బ్రాయశ్చిత్తము చేయించబడకను దప్పదు.

రాష్ట్రము సర్వవిషయములందును స్థిరమైన యున్నతిని బొందవలయుననిన భౌతికవిషయములతోబాటు ఆధ్యాత్మిక, ధార్మిక, సాంస్కృతిక విషయములను గూడ ఉన్నతిలోనికి దెచ్చు టత్యవసరము. మన రాష్ట్రము నేటివఱకు సంగ్రామ

పరిస్థితియందున్నది. ఇంతవఱకు స్వతంత్రతా సంగ్రామ విషయములనే యాలోచించుచు వచ్చినది. సైనికుని దృష్టి యందొక్క శత్రువు నెదుర్కొనుటే ముఖ్యవిషయమై యుండును. ధార్మిక, సాంస్కృతిక విషయములు కేవలము నప్రధానములే కాక మార్గమధ్యమున నభ్యంతరము గలుగ జేసినచో, వారు వాటిని దిరస్కరించ వచ్చును కూడాను. సైనికునకు గంభీరాలోచన సేయుట కవకాశముండదు. ఆ సమయమున సంస్కృతి యెడను, ధర్మముయెడను సైనికుడు చేసిన యపరాధములను క్షమించవచ్చును. కాని యుద్ధానంతర మట్టిపరిస్థితి యుండదు. స్వాతంత్ర్య సంగ్రామసమయమున నాయకులకు భారతీయధర్మ, సంస్కృతుల విషయమున నాలోచించుట కవకాశము చిక్కిడిదికాదు. వారు వీరా వేశమునను, భావావేశమునను అనుచితములగు నాచరణము లకు, నాలోచనలకు దావిచ్చినారు. వారు చూపినత్యాగమును, తపస్సును, వీరత్వము కారణమగుటచేత ప్రజలు వారిలోని దోషములను గమనించలేదు. అదృష్టవశమున నేడు దేశము స్వతంత్రమైనది. ఇక నయ్యావేశమును విడచి, తెలివిలోనికి వచ్చి రాక్షసప్రవృత్తులను విడనాడి వాస్తవికస్థితిని గుఱించి గంభీరముగ విచారణ జేయవలయును. ధార్మిక, సాంస్కృతిక నియమము ఉల్లంఘించబడు చుండగా పెద్దపెద్ద నాయకు లెవ్వరును జూచి యూరకుండరాదు. ఊరకున్నచో సామాన్యజను లింకను నుల్లంఘింప నారంభింతురు. ఎవ్వడైన నెవండైన నధర్మకృత్యమును జేసినను దానిని ఉపన్యాసము

లందు, వ్యాసములందు జర్చించి ప్రచారము చేయవలదు. ప్రచారము ప్రజల నాకార్యమునే జేయ బ్రోత్సహించును. ప్రచారస్వాతంత్ర్య మొకపద్ధతినిబట్టి అంగీకరించనువచ్చును. కాని ధర్మవిరుద్ధములగు శాసనముల నిర్మించి బలవంతముగ బ్రజల మెడకు గట్టిపెట్టు టెంతయు నన్యాయము.

ఢిల్లీలోను, ఇతరస్థానములందు హిందూకోడును నిరోధించుటకై యెన్నెని సభలు జరిగినవి. కోడును సమ్మతింపని వారెవరైన యెదుటకు రావచ్చునని కూడ చెప్పబడినది. కాని యెవ్వరు నెదుటకు రాలేదు. వేఱువేఱుగా మాత్ర మొక రొక విధముగ మాట్లాడిన వేఱొకలు వేఱువిధముగ మాట్లాడిరి. కాని యీసమర్థకులు ముఖాముఖిగ మాటలాడుట గాని, లేక తమ యాశయములను వ్యాసములద్వారా ప్రచారము చేయుట గాని చాల మంచిది.

మేమందఱము మాధర్మమును, సంస్కృతిని, సభ్యతను మా లోకప్రియ ప్రభుత్వము కాపాడగలదని యాశించుచున్నాము. మాప్రభుత్వ మీవిషయమున గంభీరవిచారణ చేయుటకు బదులుగ నధికాభినివేశముతోడ "హిందూకోడు" వంటియనావశ్యక వ్యవస్థలను చేయుచున్నదనగా మేమందఱ మెంతయు చింతింపవలసి వచ్చుచున్నది.

# హిందూకోడ్ బిల్ సమీక్ష

## వివాహము

శాస్త్రీయ వివాహమునకు, కోడు ప్రకారము క్రింది షరతులను బూర్తిసేయు టావశ్యకమని చెప్పబడినది:— (1) వివాహసమయమున నిరుపక్షములందు నేయొకరో భర్త గాని, భార్యగాని యుండకూడదు. (2) వివాహ సమయమున నెవ్వరును మూర్ఖులుగాని, పిచ్చివారుకాని, అయి యుండకూడదు. (3) వరునకు 18 ఏండ్లును, వధువునకు 14 ఏండ్లును వయస్సు పూర్తియై యుండవలయును. (4) రెండు పక్షములవారు పరస్పర నిషిద్ధమైన సంబంధము కలవారు కాకూడదు. (5) రెండు పక్షములు పరస్పర సపిండ పక్షములు కాకూడదు. మఱియు నిరుపక్షములందు శాస్త్రీయ వివాహము జరుగుట యుక్తమే యని తెలుపు నాచారము. (6) 16 ఏండ్లు వయస్సు నిండని వధువు విషయమున నామె సంరక్షకుని యనుమతి బడయు టావశ్యకము. మాతృకులమందు 3 తరములు. పితృకులమందు 5 తరములు సపిండములని భావించబడినవి. సోదర సోదరీమణులకు, పినతండ్రి సోదర పుత్రికలకు, పినతల్లి సోదర పుత్రులకు, సోదర సోదరీమణుల సంతతులకు వివాహము నిషేధింపబడినది. ఇందు అర్ధరక్త సంబంధము, సాహోదర రక్తసంబంధము, ధర్మజసంతతి

సంబంధము, అధర్మజ సంతతి సంబంధము, దత్తక సంబంధము, రక్తజ-సంబంధము, కూడ జేర్చబడినవి.

శాస్త్రీయ వివాహమున కేర్పరుపబడిన షరతులన్నియు ధర్మయుక్తములే యట. ఆలోచించి చూచిన నిదియంతయు గల్ల యని వ్యక్తము కాగలదు. ఆలోచించి చూడగ నిందలి మొదటి విషయమే చాల పొరబాటుగ దోచుచున్నది. సిద్ధాంత ప్రకారము స్త్రీ కొక్క వివాహామే యుక్తము. పతి యున్నను, మరణించినను స్త్రీ పునర్వివాహము చేసుకొనదగదు.

"నతు నామాపి గృహ్ణీయా త్పత్యౌ ప్రేతే పరస్య చ
(మను. 5-157)"

"సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే (మను. 9-47)"

"అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః
మనుష్యాణామపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి
(మను. 9-66)"

"న వివాహవిధావుక్తం విధవావేదనం పునః. (9-65)"

సావిత్రి మొదలగు వారే భయంకరాపత్తులో బడవలయునని యెఱింగియు మానసిక నిర్ణయమును మార్చుకొనలేదు గదా ! అట్టి స్థితిలో భర్త సజీవుడై యుండగనే యాతని విడచి స్త్రీ పునర్వివాహము జేసుకొను టనున దెంతయు నధర్మము కాదా ? ఇంను వేఱుగ జెప్పవలయు నదే మున్నది !

పురుషులకు గూడ ఏక పత్నీవ్రతము అత్యంత ప్రశంస నీయమే. అయినను భార్య మృతిబొందిన స్థితియందు సజీవురాలైయున్న స్థితియందు గూడ పిచ్చిదయిన కారణము చేతను, సంతతి కలుగకున్న కారణము చేతను, అగ్నిహోత్రాది కర్మలను, వంశమును నిలువబెట్టుకొనుటకై పురుషుడనేక వివాహములను జేసుకొనవచ్చునను విధానము శాస్త్రములందు స్పష్టీకరింపబడి యున్నది.

"పునర్దార క్రియాం కుర్యాత్పున రాధానమేవ చ" (మను౬-168)
ఇట్టి యితిహాసములు గూడ లెక్కలు కలవు.

స్త్రీ పురుషులం దూహింపవీలు లేని సమత్వమును స్థాపింపనెంచు మనుజులు గర్భధారణ విషయమునగూడ బురుషులను బాధ్యులనుగ జేయవలసి యుండును. స్వరూపముచేతను, అవయవములచేతను, స్వభావముచేతను, సౌభాగ్యతచేతను, శక్తిచేతనుగూడ స్త్రీపురుషులలో భేదమున్నకారణముచే వారివారి కార్యములందు శాస్త్రమును నిరూపించుచున్న భేదములనుగూడ స్వీకరించవలసినదే. పురుషుడు తన ప్రకృతిచేత సంవత్సరమం దనేకమంది బిడ్డలను కనగలడు. స్త్రీతన ప్రకృతిజేత సంవత్సరమం దొక్క పర్యాయమే బిడ్డలను గనును. ఇట్టి స్థితియం దీసమత్వనాటక మంతయు నెందులకు? గర్భధారణమును, శిశుపోషణమున నసాధారణశక్తి తల్లిదే. అనేక సంతానోత్పాదనశక్తి కేవల మొక్క పురుషునియందే యుండును. కనుక శాస్త్రాను

సారముగ నిరువురి వివాహములందు, బాధ్యతలందు నధిక భేద మున్నది. వ్యావహారికముగ వంశరక్షణనిమిత్తమై భార్యయే భర్తను పునర్వివాహము జేసుకొన ప్రోత్సహించును. కాని కోడుబిల్లును బట్టి యట్లు జరుగజాలదు. పునర్వివాహానిమిత్తముగ మొదటి భార్యకు విడాకులిప్పించి తీరవలసినదే యట! ఆహా! ఏమి ధర్మము! భార్య యిష్టపడినప్పుడు కూడ వంశరక్షణనిమిత్తముగ బురుషుడు పునర్వివాహము జేసుకొన గూడదట!

మహమ్మదీయులలో బహువివాహ విధానము యుక్తమే. కాని హిందువులలో నీహిందూకోడుమూలమున శాస్త్రవిశ్వాసము, ధర్మవిశ్వాసము నంతరించియే పోవును. ఇక నాదంపతు లిరువురు మహమ్మదీయులలో గలసి తమ మనోరథము నీడేర్చుకొందురు. అట్టి స్థితిలో హిందూకోడు ధర్మము నేమి రక్షించును? పైగా మహమ్మదీయులలో బహువివాహవిధానమును నిరోధించనంతవరకు పైవిధానమును నిర్మించనే కూడదు. అట్లు నిర్మించిన భారతీయసమాజమందు తప్పక క్రొత్త పాకిస్తానుకు బునాది యేర్పడును. హిందువుడు తన జీవితమం దొక్క పెండ్లి చేసుకొని నలుగురు బిడ్డలను గనిన, మహమ్మదీయుడు నాలుగు పెండ్లిండ్లు చేసుకొని పదహారుగురు బిడ్డలను గనగలడు, ఈకారణముచేత హిందువుల సంఖ్యతగ్గును. మహమ్మదీయుల సంఖ్య పెరుగును. మఱల వారు పాకిస్తానును గోరనారంభింతురు. హిందూకోడు కారణముగ మను, యాజ్ఞవల్క్యాది మహర్షులను, వేదాది

శాస్త్రములను తిరస్కరింప సాహసించిన వారు లోక ప్రభుత్వ మేర్పరచిన హిందూకోడు మున్నగు శాసనములను తిరస్కరించుట కెంతమాత్రము జంకుగొనరు. క్రమక్రమముగ వారిలో విశ్వాసభావ మంతరించి పునర్వివాహము జేసుకొన వచ్చునను ఆశకొలది మహమ్మదీయ మతమును స్వీకరింప నారంభింతురు. అప్పుడు హిందూధర్మ రక్షణవిషయము గగన కుసుమమై పోవును,

డాక్టరు అంబేద్కరు మహాశయులు సెలవిచ్చిన విషయ మేమనగా — "హిందువుడు తన యింట 'వధూవరు లిరువురు నొకే వర్ణమునకు, నొకే జాతికి, నొకే యుపజాతికి జెందినవారయి యుండు టావశ్యకము' విషయ మాచారముగా వచ్చుచున్నచో, దానిని బట్టి యాతడట్లే చేయవచ్చునట. కాని దేశహితవాది యెవండైన హిందూవర్ణములందు, జాతులందు, నుపజాతులందు విశ్వాసము లేనికారణమున నేబయటి పిల్లనైన బెండ్లాడ నెంచిన నాతడు నట్లు చేయవచ్చునట. రూఢివాదులు (ఆచారముగవచ్చు విషయముల నాదరించువారందఱు) తమతమ ధర్మానుసార మెట్లు తలచిన నట్లు చేసుకొనవచ్చునట. ఒక ధర్మము ననుసరింపనెంచని దేశహితవాదు లెవ్వరైన దమ యాలోచనమును, దమ యంతఃకరణమును అనుసరించి నడచుకొనుటకు స్వతంత్రులట." దీనిని బట్టి జాతిమతభేదానుసారము జరిగిన పెండ్లి ధార్మికవివాహమనియు, జాతిమతభేదములతోడ నిమిత్తము లేకుండ జరిగిన వివాహము సివిలుమేరేజి, లేక రిజిస్ట్రిమేరేజి యనియు స్పష్ట

మయినది. ఇందుచేతనే హిందూ శాస్త్రీయపు వివాహమును రిజిస్ట్రీ మేరేజిని — రెంటిని కూడ సంగీకరించినారు. పైగా గొందరు జాతిమతవిచక్షణతో నిమిత్తములేకుండ జరిగిన పెండ్లికూడ శాస్త్రీయమే యని నిరూపింప బ్రయత్నించుచున్నారు. కాని దానివలన బ్రయోజనమేమియును లేదు. ఏలయన హిందూ కోడును బట్టికూడ ఆ పెండ్లి యధార్థికమే యగును. కాని యాలోచించదగు విషయమేమనగా హిందూధర్మమునుగాని, శాస్త్రములనుగాని యాదరింపక వ్యతిరిక్తాచరణము జేయువాడుకూడ హిందువుడే యగునా? ఒకవేళ హిందువుడే యైనచో కోడుబిల్లు హిందూధర్మమును రక్షించునది యని భావించుటెట్లు? హిందూధర్మమును, హిందూశాస్త్రములను, హైందవాచారములను ఉపేక్షచేసి విరుద్ధముగ నడచుకొను వాడుకూడ హిందువుడే యైనచో కూతురును పెండ్లాడిన తండ్రియు, సోదరిని పెండ్లాడిన సోదరునుకూడ హిందువులా? కాదా? యనికూడ ప్రశ్నవేసుకొనవలసి వచ్చును. వారు కూడ హిందువులే యనినచో, నట్టి విషయములు కూడ హిందూకోడుయందున్నవన్నమాటయే.

ఈస్థితిలో మహావీరత్యాగి వేసిన ప్రశ్నయే బాగుగ నున్నది. ఏమని యనగా "అంతఃకరణముయొక్క ప్రేరణయే మాన్యమయిన స్థితిలో నవండైన మతాంతర వివాహము కూడ జేసుకొనవచ్చునా?" దీని కెచ్చటను సమాధానము గాన్పింపదు వాస్తవమున నిది యొక యనర్థము. శాస్త్రములను ధర్మములను దీసి యావల బెట్టుడని ప్రోత్సహించు

పద్ధతి. పతనోన్ముఖ ప్రవృత్తులు స్వాభావికములని యందరు నెరిగిన విషయమే. శాస్త్ర ధర్మ విశ్వాసమున్నవాడు మనుజుడు పతనమునకు దూరీభూతుడగును. రాజ్యమందు దురాచార, సదాచారములను, సత్య, అసత్యములను — రెంటికిని స్వతంత్రత నిచ్చిన స్థితిలో సదాచారమందు, సత్యవిషయమునను ప్రవర్తించు జనులెందరుందురు ? శాస్త్రోక్తములగు వర్ణాశ్రమ ధర్మములను పాటింపను వచ్చును, ఉల్లంఘించను వచ్చునన్న స్థితిలో కఠిన నియమములను పాటించుట కెవ్వరుద్యుక్తులగుదురు. ? 'మద్యము త్రాగను వచ్చును. త్రాగకుండను ఉండవచ్చును. వ్యభిచారము చేయనువచ్చును. చేయకుండను ఉండవచ్చును. ఎట్లు చేసినను సమానమే' యని రాజ్య, సమాజములందు సంపూర్ణ స్వాతంత్ర్య మిచ్చివేసినచో, శాస్త్రీయ నియమములు పాటింపబడుననునాశయే వ్యర్థము. కావుననే శాస్త్ర విరుద్ధకార్యములను జేయ నవకాశ మిచ్చుట ఆత్మహత్య జేసికొనిన నవకాశమిచ్చుటతో సమానమని విద్వాంసుల మతము. రెండువిధముల కార్యములను సమానముగ భావించుటకాని సతిమతల్లిని, వేశ్యను సమానముగ భావించుటయే ఇది చాలయనుచిత విషయము. కనుక శాస్త్ర ధర్మముల విశ్వాసములేని వారికి 'సివిలు మేరేజి'యే బాగున్నది. హిందూకోడును నిర్మించి శాస్త్ర విశ్వాసులను, అవిశ్వాసులను సమానముగ జూచి ధర్మ విశ్వాసమును, శాస్త్రవిశ్వాసమును శిథిల పరచుట ఏమియు బాగులేదు.

'బిల్లు ఆచరణలోనికి వచ్చిననాటి నుండియు ప్రాచీన నియమములు, నాచార వ్యవహారములు అన్నియు రద్దు చేయబడగలవు' అని కోడులో స్పష్టముగ వ్రాసి యుంచబడినది. హిందూకోడు ద్వారా ప్రాచీన శాస్త్రము లన్నియు మంట గలుపబడు చున్నవని దీనిని బట్టియే స్ఫుటమగుచున్నది. శాస్త్ర ధర్మ విశ్వాస మంతరించుట తోడనే అన్న చెల్లెండ్ర వివాహ సమస్య సంభవించును. దానికి గూడ కొంత వ్యవస్థ చేయవలసియే వచ్చును. ప్రాచీన శాస్త్ర నియమములను, ఋషిగణముయొక్క యాదేశములను తిరస్కరించుట కభ్యాసపడిన వ్యక్తులు వర్తమాన శాసకుల శాసనముల నుల్లంఘించుట కెంతమాత్రము సంకోచింపరు.

ఇదియు గాక వైదిక వివాహము తర్కసమ్మతమైన విషయము. చాల దూరపు వ్యక్తుల రక్తసంబంధము. చాల దగ్గఱ వ్యక్తుల రక్తసంబంధము నిర్వీర్యమయి పోవునను విషయము స్పష్టము. ఈ స్థితిలో ధార్మిక విధానము తర్కవిరుద్ధమని భావించుటెట్లు! ఇట్టి శాస్త్రాచార్యుల యుపదేశములచే సంస్కరింపబడిన యంతఃకరణమం దుదయించు ప్రేరణయు శాస్త్రానుకూలమే యగును. ఇక శాస్త్రీయవివాహ మంతఃకరణ ప్రేరణకు విరుద్ధముగా నెటులుండును? ప్రేరణ యెటులున్నను బాధలేదందురా? ఏ స్వేచ్ఛాచారి యంతఃకరణమందైన కూతురును చెల్లెలును పెండ్లాడవలెనని ప్రేరణ బయల్వెడల వచ్చును. కసాయివాడు గోహత్యకు పాల్పడుట కూడ వాని యంతఃకరణ ప్రేరణయే.

శ్రీ ధర్మదేవు లిట్లు వ్రాయుచున్నారు:-

"జాయాపత్యే మధుమతీం వాచం వదతు శంతివామ్
(అధర్వ. 4-30-2)"

"ఇహేమా వింద్ర సనంద చక్రవాకేవ దంపతీ"
(అధర్వసం. 14-2-64)

ఇత్యాది వేదమంత్రములందు ఒక్క వివాహమే యాదర్శమైనదని స్పష్టముగ సమర్థించ బడినది.

"సంపాతపంత్యభిత స్సపత్నీరివ పర్శవః" ( ఋగ్వేద. 1-104-8)

ఇత్యాది మంత్రములందు సపత్నీత్వము అత్యంత దుఃఖదాయకమని స్పష్టీకరింపబడినది. కాని యిక్కడ చక్రవాకముల యుపమానము భార్యాభర్తల దాంపత్యమును సమర్థించుచున్నది. విడాకుల చట్టమున కిష్టపడు వారికిది యంతయు నెందులకు నచ్చును? చక్రవాక మిథునము వియోగ కారణముచే రాత్రి యంతయు నాక్రోశించుచునే యుండును. తెల్లవాఱగనే మరల గలసికొని యానందించును. భర్త మృతిబొందినప్పటి విషయ మెటులున్నను జీవించియుండగనే విడాకులిచ్చి పునర్వివాహము జేసుకొనవచ్చు నన్నచో నిక దంపతులయెడ నాచక్రవాకదృష్టాంత మెట్లు చరితార్థమగును? వస్తుతః పైజెప్పిన మంత్రమందు దంపతుల పరస్పరప్రేమ, స్నేహము వర్ణించబడినది. వేఱుగ నవసరములగు సంతానాదుల నిమిత్తముగా వేదవిహితమైన వివాహాంతరములు నిషేధింపబడ లేదు, ఒక్క యూపమునకు రెండు త్రాళ్లను గట్టవచ్చును. కాని ఒక్క త్రాటికి రెండు యూపములు కట్ట

వడజాలవు. ఇట్లే ఒక పురుషున కిరువురు భార్య లుండ వచ్చును. కాని ఒక స్త్రీకి ఇరువురు భర్తలు ఉండజాలరు.

"యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి తస్మా దేకో ద్వే జాయే విందతే, యన్నైకాం ద్వయో ర్యూపయోః పరివ్యయతి తస్మాన్నై కా ద్వా పతీ విన్దతే" (తై. సం. 6-5-1-4)

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యునకు కాత్యాయని, మైత్రేయి యను నిరువురు భార్యలు కలరని వర్ణించ బడినది. సపత్నీత్వము కడు దుఃఖదాయకమని చెప్పు మహాశయుడు కూడ వేదప్రతిపాదితమైన సపత్నీవిధానము నంగీకరింపక దప్పదు. నిషేధాత్మకవచన మేదేని దొరకనంతవరకు నావశ్యకములగు వివాహాంతరముల కభ్యంతర ముండదు.

"కల్యాణీభి ర్యువతిభి ర్నమర్యః" (ఋ- 10-30-5)

"జనీరివ పతిరేక స్సమానః ని మామృజే పుర ఇంద్ర స్సు సర్వాః" (ఋ. 7-26-3)

అనగా ఇంద్రుడు కేవల మొంటరియై శత్రుపురముల నన్నిటిని ఒక్క భర్త యనేక భార్యలను శోధన జేసినట్లుగా శుద్ధిచేసెను. ఈ మంత్రమును బట్టి యొక పురుషునకు బలువురు భార్యలుండుట చెప్పబడినది. 'అనేక మంగళప్రదురాంద్రగు యువతులతోడ గూడిన పురుషుడు' అని ప్రథమ మంత్రమందు వర్ణించబడినది. ఒక్క భర్త అనేక భార్యలతో సమానుడని రెండవ మంత్రమువలన బ్రకటమగుచున్నది.

"రాజేవ హి జనిభిః క్షేష్యేవాద్యుభిః" (ఋ 7-18-2)

అనగా ఓయీ ఇంద్రా ! ఒక రాజు అనేక స్త్రీల తోడ శోభించునట్లు నీవు అనేక దీప్తులతోడ నలరారు చుంటివి. ఈ మంత్రమందొక పురుషున కనేక భార్యలు వర్ణింపబడిరి.

" పతిర్జనీనామ్ " (ఋ. 1-66-8)

ఇందుగూడ ననేక స్త్రీల కొక భర్త బోధింపబడినాడు.

" క్షీరేణ స్నాతః కుయవస్య యోషే హతే తే స్యాతామ్ "
(ఋ. 1-104-3)

" మర్య ఇవ యువతిభి స్సమర్షతి " (ఋ. 9-86-16)

" ఏవే ద్యూనే యువతయో నమన్త " (ఋ. 10-30-6)

" పరిష్వజన్తే జనయో యథా పతిమ్ " (ఋ. 10-43-1)

" ఇంద్రం జుషాణా జనయో నమస్త్రీః " [కా. సం. 36-6]

" మనోర్వై దశ జాయా ఆసన్ " [మై. సం. 1-5-8]

ఇత్యాది అనేక మంత్రముల వలన నొక్క పురుషునకు పలువురు భార్య లుండవచ్చునని బాగుగ దేటతెల్లమగుచున్నది. కౌటిల్యులు కూడ వ్రాయుచున్నారు—

" పుత్రార్థీ ద్వితీయాం భార్యాం విన్దేత "

అనగా పుత్ర నిమిత్తముగా రెండవ భార్యను గ్రహింపవచ్చును—

' వధూవరులం దెవరును మహారోగులుగాని, పిచ్చివారుగాని కాకూడదు. ' ఇది మిగిలియున్న షరతు. వాస్తవమందు వివాహ సమయమున నా విషయములం దెక్కువ

దృష్టి నుంచవలసినదే. కాని మూర్ఖత్వాదికమును నిర్ణయించుట కఠినము. ఏదియో యొక అంశమున వందతియందు మూర్ఖత్వ ముండవచ్చును. సతీమతల్లి వివాహమైన పిమ్మట భర్తను విడనాడుట తెలివనే తలవదు.

ఇట్లే కన్యకు 14 సంవత్సరములు నిండవలయునను విషయమును ధర్మవిరుద్ధమే.

"అష్టవర్షా భవేద్గౌరీ" "త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవర్షికాం త్ర్యష్టవర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః."

(మను. 9-94)

ఇత్యాది వచనములు ప్రమాణభూతములు.

"ఉపోపమే పరామృశ మా మే దభ్రాణి మన్యథాః సర్వాహమస్మి రోమశా గాంధారీణా మివావికా" (ఋ. 1-126-7)

ఈ మంత్రమువలన 'యౌవన మంకురింపని కన్యను పెండ్లాడి సంభోగార్థము ప్రతీక్ష సేయవలయును.' అని వ్యక్తమగుచున్నది.

"అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాం స తే భాగో జనుషా తస్య విద్ధి"

[ఋ. 10-85-21]

ఈ మంత్ర మందలి 'వ్యక్తామ్' అను పదమునకు సాయణులు భాష్యము వ్రాయుచున్నారు.

"వ్యక్తామనూఢేతి పరిస్ఫుటాం విగతాంజనాం వా
స్తనోద్గమాది రాహిత్యేన అప్రౌఢా మిత్యర్థః"

దీనినిబట్టి యప్రౌఢయగు కన్యకు పెండ్లిసేయుటే వేద సమ్మతము.

"ప్రదానం ప్రాగృతోః" (గౌ. ధ. సూ. 18-22

ఇందు కూడ కన్యను రజస్వల కాకపూర్వమే పెండ్లి సేయవలయునని చెప్పబడినది.

"స్యూనాద్ధి ప్రజా అసృజత" (తై. సం. 6-1-27)

దీనినిబట్టి కూడ తక్కువ ప్రాయమున పెండ్లి చేయవలెనని సూచింపబడు చున్నది. కౌటిల్యులు పండ్రెండవ యేట స్త్రీ వ్యవహారయోగ్యురాలని చెప్పుచున్నారు.

"షోడశవర్షే పుమాన్ ద్వాదశవర్షే స్త్రీ ప్రాప్తవ్యవహారా భవతి"

(ధర్మస్థప్రకరణే)

రజోధర్మము జరుగగనే వికృతి కలుగనారంభించును. భర్త నిశ్చయింపబడిన మీదట నావికారము చెందిన మనస్సులోని ప్రేమ యా భర్తయందు కేంద్రీభూతము కాజొచ్చును. భర్త నిశ్చితుడు కానిచో స్త్రీ మానస మిటు, నటు బరువులెత్తుటయు, క్షేత్ర మపవిత్రమగుటయు సంభవించును. మనస్సు చెదిరిన సంతానముకూడ తదనుకూలముగనే యుండును. అమెరికాలో నొక యూరోపీయ మహాశయునకు, యూరోపీయ వనితకు నల్లని నీగ్రోజాతి బాలుడు కలిగినాడని ప్రసిద్ధి. డాక్టరులు పరిశోధన జేసి నీగ్రోజాతివాని చిత్రపటమును చింతన చేసినంత మాత్రమున నల్లజాతి సంతతి కలిగినదని చెప్పినారు. కనుక శుద్ధసంతానార్థమై రజస్వల కాకపూర్వమే పెండ్లిసేయుట చాల మంచిది. గర్భాధానము 14 వత్సరములు గడచిన తరువాతనే చేయవచ్చును.

వాస్తవమున వివాహ మొక సంస్కారము. పురుషునకు ఉపనయనసంస్కారము జరిగినట్లు కన్యకకు వివాహసంస్కారము జరుగును.

"వైవాహికో విధిః స్త్రీణామౌపనాయనికః స్మృతః"

(మను. 2-67,68)

కనుక ఉపనయనకాలమే కన్యకు వివాహకాలము. పతిసేవ, గురుసేవ, శ్వశురకులవాసము, గురుకులవాసము నొకె కార్యములు. గర్భాధానాదులు వేఱు. 14 లేక 16 ఏండ్ల కాలము గర్భాధానాదుల కనువయినది. 8 మొదలు 12 వత్సరముల వఱకు వివాహమునకు సముచిత సమయము. సంస్కారకాల మతిక్రమించినచో పురుషు డెట్లుగ ప్రాయశ్చిత్తము జేసుకొనవలయునో, అట్లే రజస్వలయైన కన్యకు ప్రాయశ్చిత్తానంతరమే వివాహము విధించబడినది.

మాతాచైవ పితా చైవ జ్యేష్ఠభ్రాతా తథైవ చ
త్రయస్తే నరకం యాన్తి దృష్ట్వా కన్యాం రజస్వలామ్॥

(సంవర్త 1-67)

పితుర్గృహే చ యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా
సా కన్యా వృషలీ జ్ఞేయా తత్పతిర్వృషలీపతిః॥ (హారీత)

భ్రూణహత్యా పితుస్తస్యాః సా కన్యా వృషలీ స్మృతా
యస్తాం సముద్వహేత్కన్యాం బ్రాహ్మణో జ్ఞానదుర్బలః॥
అశ్రాద్ధేయం హ్యపాంక్తేయం తం విద్యాద్వృషలీ పతిమ్॥(దేవల)

అత్రి, కశ్యపుడు, భోధాయనుడు, విష్ణువు, యముడు మున్నగు వారందఱి మతము నిదియే. 'రజోదర్శనముతోడనే

తండ్రియందు స్వామిత్వ ముండదు.' అని మనువు కూడ సమ్మతించుచున్నాడు.

"సహి స్వామ్యాదతిక్రామే దృతూనాం ప్రతిరోధనాత్" [మను]

"కన్యామృతుమతీం శుద్ధాం కృత్వా నిష్కృతిమాత్మనః
శుద్ధిం చ కారయిత్వా తాముద్వహేదాన్పృశంస్యధీః"

ఇత్యాది వచనముల ద్వారా ఆశ్వలాయనుడు రజస్వలా వివాహమునకు ప్రాయశ్చిత్తమును జెప్పినాడు. (నిర్ణయ సింధు) నగ్నికను అనగా రజస్సు నెఱుగని కన్యను ఏ గుణవంతుడగు బ్రహ్మచారికో యిచ్చి పెండ్లి చేయవలయునని బోధాయనుడు చెప్పినాడు. గుణవంతుడు దొరకని యెడల గుణహీనునికైన యిచ్చి పెండ్లి చేయవలసినదే. కాని రజస్వలను మాత్రము కానీయకూడదు.

"దద్యాద్గుణవతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే
అథవా గుణహీనాయ నోపరున్ధ్యాద్రజస్వలామ్" [4.12]

గౌతమ మతానుసారముగ కూడ రజస్వల కాక పూర్వము కన్యాదానము సేయనివాడు దోషి యగును. "అప్రయచ్ఛన్ దోషీ" మన్వాది మహర్షులందఱి యభిమతము నిదియే.

"త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవర్షికామ్,
త్ర్యష్టవర్షోష్ట వర్షాం వా ధర్మే సీదతి సత్వరః॥"

ఈ మనువచనము కూడ కన్యకు 8 మొదలు 12 ఏండ్ల లోపుననే వివాహము విధించుచున్నది. కన్య రజస్వలయైన

తోడనే తండ్రియందు స్వామిత్వము తప్పిపోవును. అప్పుడా కన్యయే తన యిచ్చవచ్చిన వరుని వరించవచ్చును. ఆస్థితి యందు శుల్కము కూడ నీయనక్కఱ లేదని చెప్పబడినది.

"పిత్రే న దద్యాచ్ఛుల్కంతు కన్యామృతుమతీం హరన్।
సహి స్వామ్యాదతిక్రామేదృతూనాం ప్రతిరోధనాత్॥ "
(మను. 9-93)

'తల్లి, తండ్రి, పెద్ద అన్నగారు అవివాహితయగు కన్యను రజస్వల యగువఱకు నుంచిన నరకమును బొందుదురు' అని సంవర్తులుకూడ జెప్పుచున్నారు.

"మాతా చైవ పితాచైవ జ్యేష్ఠో భ్రాతా తథైవచ।
త్రయస్తే నరకం యాన్తి దృష్ట్వా కన్యాం రజస్వలామ్॥"

హారీతులుకూడ ఇదియే చెప్పుచున్నారు.

"పితుర్గృహే చ యాకన్యారజః పశ్యత్యసంస్కృతా।
సా కన్యా వృషలీ జ్ఞేయా తత్పతి ర్వృషలీపతిః॥"

రజస్వలయైన కన్యయొక్క తల్లి, తండ్రి, ఆమెను పెండ్లాడు భర్త ముగ్గురును దోషమును బొందుదురు.

"భ్రూణహత్యాపితుస్తస్యాః సా కన్యా వృషలీస్మృతా।
యస్తాం సముద్వహేత్కన్యాం బ్రాహ్మణోఽజ్ఞాన దుర్బలః।
అశ్రాద్ధేయం హ్యపాంక్తేయం తం విద్యాద్వృషలీపతిమ్॥"

దేవల, అత్రి, కశ్యపుల యభిప్రాయములు కూడ నివియే. (ధ. సూ. 18-23)

ఇట్లే హిందూకోడుకు చెందిన వివాహమునకు వర్ణ వ్యవస్థతో నిమిత్తము లేదనినారు. ఏ జాతి పిల్లవాడైన యేజాతి పిల్లనైన పెండ్లాడవచ్చునట. కొందఱు జనుల యభిప్రాయమేమనగా జన్మమూలకమగు జాతివ్యవస్థయే బాగు లేదట. డాక్టరు అంబేద్కరు ప్రభృతులు స్పష్టముగా జాతి పంక్తి భేదమే ఉంచదలచుకొనలేదు. కొందఱు జనులు కర్మ చేత వర్ణవ్యవస్థ చేయుదమని తలచుచున్నారు. ఆవిషయము ననేకమారులు ఖండించుటకూడ జరిగిపోయినది. శాస్త్రములందు బ్రాహ్మణాది జాతుల నుద్దేశించి కర్మములు విధించ బడినవి. కర్మల నుద్దేశించి జాతులు విధించబడలేదు. తల్లి, సోదరి మొదలగువారిని ఉద్దేశించి వారి కర్తవ్యములు విధించ బడును. కాని కర్మలనుద్దేశించి మాతృత్వాదులు విధించ బడవు. అనగా 'మాతా ఏవంకుర్యాత్, పత్నీ ఏవంకుర్యాత్' అని విధాన మీవిధముగనే యుండును. కాని 'యా ఏవం కుర్యాత్సామాతా, యా ఏవం కుర్యాత్సాభగినీ' అని యిట్టి విధాన ముండదు. ఇట్లే యుండినచో పత్నీకృత్యమును చేసిన కారణముచేత సోదరియు, పుత్రికయుగూడ పత్నులే యగుదురు. ఇది శాస్త్రసమ్మతము కాదు. ఇట్లే 'బ్రాహ్మణః ఏవం కుర్యాత్' అని విధానముండును. కాని 'య ఏవం కుర్యాత్స బ్రాహ్మణః' అని విధాన ముండదు. కనుక బ్రాహ్మణకర్మ చేసినంతమాత్రమున నెవ్వడు బ్రాహ్మణుడు కాజాలడు. కర్మచేతనే వర్ణవ్యవస్థ యుండురా ? అందఱు దినదినము అనేక మార్లు బ్రాహ్మణులుగను, అనేకమారులు శూద్రులుగను

మారవచ్చును. ఇక వ్యవస్థ యెట్లు నిలుచును? ఒక బ్రాహ్మణుడు కర్మచేత శూద్రుడు కావచ్చును. ఆతని భార్య బ్రాహ్మణిగనే యుండవచ్చును. ఆస్థితిలో నాతడామెకు విడాకులైనా యీయవలెను. లేదా వారిరువురికి గలిగిన సంతతి చండాలసంతతి యగును. కర్మణా వర్ణవ్యవస్థ చేయబోవువారు దీనికేమి సమాధాన మిత్తురు? ఉపనయనాది సంస్కారముల నెట్లు చేతురు? బాలకుని కర్మాదులను నిర్ణయించుటే కఠినమైపోవు నన్నమాట. పైగా బ్రాహ్మణునకు శర్మాన్తనామ సంస్కారము యెనిమిదేండ్ల ప్రాయమున వసన్తఋతువునం దుపనయనసంస్కారము నెట్లు పొసగును? సంస్కార, అధ్యయన కర్మాదులనుబట్టి జాతి నిర్ణయించబడిన జాతి నిర్ణయమును బట్టి సంస్కారాదులు జరుగును. ఇచ్చట అన్యోన్యాశ్రయ దోషము బాగుగ స్ఫుటమగుచున్నది.

"బ్రాహ్మణో౽స్య ముఖమాసీత్ బాహూరాజన్యకృతః,
ఊరూత దస్యయద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత"

ఇత్యాదుల వలన బ్రాహ్మణాదుల పుట్టుక స్పష్టీకరింపబడి యున్నది. "జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః" ఇది కూడ స్పష్టమే.

"అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ
సమానవయసశ్చాత్ర మరుతో రుక్మవక్షసః"

ఈ మంత్రము మరుత్తుల నుద్దేశించి చెప్పబడినది. వారు 49 మందిగురు. అందఱు సమవయస్కులు. వీరిలో

జ్యేష్ఠత్వ, కనిష్ఠత్వము లూహింపబడవు. వాస్తవముందు శబ్దము జ్ఞప్తికి దెచ్చునది యగునుగాని కారకము కాజాలదు. "న హి శబ్దః శతమపి ఘటం పటయితుమీష్టే" నూరు శబ్దము లయినను ఘటమును పటముగ మార్చజాలవు. వయస్సు చేతను గుణముచేతను వాస్తవిక జ్యేష్ఠత్వ, కనిష్ఠత్వములున్నచో నిరాకరించు టసంభవము.

"శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్" స్పష్టముగ శూద్రునకు బ్రాహ్మణత్వము, బ్రాహ్మణునకు శూద్రత్వము వచ్చునని చెప్పబడినది — ఈ వాక్యము కొందఱకు ఊతగా నున్నది. ఇదియు సప్రయోజనము కాదు. ఏలయన "సత్కర్మ చేసిన శూద్రుడు జన్మాంతరమందు బ్రాహ్మణుడగును. మఱియు దుష్కర్మ జేసిన బ్రాహ్మణుడు జన్మాంతరమందు శూద్రుడగును" అని యిదియె యందలి భావము. కుక్క పంది మొదలగునవి జన్మాంతరమున గాని వేఱుయోనిని బొందవు. అట్లే బ్రాహ్మణాదులును జన్మాంతరమున గాని వేఱు యోనిని బొందజాలరు. వేదములు శ్వ, శూకరాది యోనులతో సమానముగనే బ్రాహ్మణాది యోనులను వేఱు వేఱుగ గ్రహించినవి.

"తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహయత్త
రమణీయాం యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోని వా
క్షత్రియ యోనిం వా వైశ్యయోనిం వా
అథ య ఇహ కపూయ చరణా అభ్యాశోయత్తే

కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా
సూకర యోనిం వా చణ్డాలయోనిం వా ''

అనగా శుభ కర్మలవలన బ్రాహ్మణాది యోనులు, నశుభ కర్మలవలన శ్వాది యోనులు సంప్రాప్తించును. వాస్తవమున

" శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసా చేత్ప్రజాయతే
అశ్రేయాన్ శ్రేయసీం జాతిం గచ్ఛత్యాసప్తమా ద్యుగాత్ ''

[10-64]

దీనిని బట్టి మనువు చెప్పునది యేమనగా శూద్రకన్యకు బ్రాహ్మణునివలన కన్యక కలుగ నామెకు మఱల బ్రాహ్మణునితోడ వివాహబంధన మేర్పడి కన్యక యేకలిగి యాకన్యకు గూడ మఱల బ్రాహ్మణ సంపర్కమువలన కన్యయె కలుగుచు నీవిధముగ నేడవ తరమందలి కన్య బ్రాహ్మణి యగును. దీనిని బట్టి బీజమునకు ప్రాధాన్యత చెప్పబడినది. కాని క్షేత్రమునకు చెప్పబడలేదు. దీనిని బట్టి శూద్రుడు బ్రాహ్మణకర్మ చేసినంతమాత్రమున బ్రాహ్మణు డగునను విషయము ఖండించబడినది.

"న జాత్యా బ్రాహ్మణశ్చాత్ర క్షత్రియో వైశ్య ఏవన।
న శూద్రో న చవైమ్లేచ్ఛో భేధితా గుణకర్మభిః" (శుక్రనీతి)
"న కులేన న జాత్యా వా క్రియాభిర్బ్రాహ్మణో భవేత్" (మ. భా.)

ఇత్యాది వచనములు కర్మణా వర్ణవ్యవస్థను ప్రోత్సహించుటకు తోడ్పడుచున్నవి. కాని యిదియు సంగతము కాదు. వాస్తవమున నీవచనములందు గుణకర్మముల

హేతుత్వము మాత్రము చెప్పబడినది. కాని పూర్వోక్త శ్రుతుల ప్రకారము జన్మాంతరమందలి గుణకర్మలను బట్టియే బ్రాహ్మణాదు లేర్పడుదురు. కార్యమునకు ముందే కారణ ముపయోగింపబడును. కార్యానంతరము కారణముండదు. ఘటకారణములగు మట్టి, కఱ్ఱ, కుమ్మరి మొదలగునవి ఘటోత్పత్తికిముందే కావలసి యుండును. ఉత్పత్తి కారణ ములు అన్యఘటమునకు కారణములగును. కాని ఉత్పన్న ఘటమునకు గారణములు కావు. ఇట్లే ప్రాక్తనగుణకర్మలే బ్రాహ్మణాదుల యుత్పత్తికి గారణములగును. ఈ పుట్టిన బ్రాహ్మణాదుల గుణకర్మల యుపయోగము ముందలి జన్మాం తరమందు జరుగును. కాని యుత్పన్న కార్యమునను జరుగదు. ఈవిషయమే "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" ఆదులలో చెప్పబడినది. పరమేశ్వరుడు గుణకర్మానుసారముగా సృష్టిచేయును. గుణకర్మానుసారముగ సృష్టియందు పరివర్త నము జరుగదు. ప్రాక్తనకర్మానుసారమున్న కార్యములు జరుగును.

ఈ విషయము నాస్తికులందఱు సమ్మతించెదరు. వాస్తవమున సింహదంపతులకు బుట్టినది శౌర్య ధైర్యాది గుణకర్మములతోడ నుప్పారు సింహమేయగును. గుణకర్మలు లేకున్నను సింహమునకు సింహికి బుట్టినది జాతిసింహమగును. సింహ మిథునమునకు జన్మించకున్నను శౌర్య ధైర్యాది గుణ ములు కలిగి యుండుటచే "సింహోహాదేవ దత్తః" అని కూడ చెప్పబడుచున్నది. అట్లే బ్రాహ్మణ దంపతులకు జన్మించి శమదమాది బ్రాహ్మణోచిత కర్మలతోడ విల

సిలువాడు ముఖ్యబ్రాహ్మణు డనబడును. స్వాభావిక గుణ విహీనుడైనచో జాతిబ్రాహ్మణు డనబడును. కాని బ్రాహ్మణ దంపతులకు జన్మింపని వారియందుగూడ బ్రాహ్మణోచిత గుణ కర్మాదులుండుటచే గౌణ బ్రాహ్మణత్వ మారోపింపబడుచున్నది.

" విద్యా తపశ్చ యోనిశ్చ త్రయం బ్రాహ్మణ్య కారణమ్
విద్యా తపోభ్యాం యో హీనో జాతిబ్రాహ్మణ ఏవ సః "

[మ. భా.]

గోవుయొక్క గుణములు కల యాడుగాడిదను గాని, యాడు కుక్కనుగాని 'గోవు' అని భావించి వైతరణిని దాటుటకై దానము సేయుదురా ? తేజస్సు మొదలుగాగల గుణము లన్నియు గలదయ్యు స్మశానాగ్ని నుపయోగింతురా? అట్లే బ్రాహ్మణోచిత గుణకర్మములు కలిగియుండియు నబ్రాహ్మణునకు బ్రాహ్మణునితోడ వివాహ ఆహార సంబంధము పనికిరాదు. మహాభారతమందు కూడ స్పష్టీకరింపబడియున్నది— " మతంగు డనువాడు పెక్కేండ్లు తపము చేసియు బ్రాహ్మణత్వమును బొందలేదట " నిషాద గ్రామమందుండి కర్మభ్రష్టుడైన యొక జాతిమాత్ర బ్రాహ్మణుని వలన గరుడుని కంఠమందు తాపము కలిగినది. ఇవన్నియు జన్మనా వర్ణవ్యవస్థను బోధించు చరిత్రములు. భీష్ముడు. యుధిష్ఠిరుడు పరమ శమదమాది గుణ సంపన్నులయ్యు బ్రాహ్మణు లనబడ లేదు.

" ఎవండైన జాతిచేతను బ్రాహ్మణుడు కాడు. గుణము చేతను, నడతచేతను బ్రాహ్మణుడగును. " శాస్త్రములందిట్టి వచనము లెన్నియో గానవచ్చును. కాని యవి గుణమును, నడతను బ్రశంసించుటకే చెప్పబడినవని యెఱుంగవలెను. ఎట్లనగా " యోఽర్థే శుచిః సహి శుచిః నమృద్వారిశుచిశ్శుచిః " ధనముయొక్క పవిత్రతయే నిజమయిన పవిత్రత. మృత్తికా జలముల ద్వారా సంపాదించిన పవిత్రత పవిత్రతయే కాదు. ఇది యర్థశుద్ధిని బ్రశంసించుటకు జెప్పబడినది. కాని మృత్తికా జలంబుల శుచిత్వము నిషేధింపబడినదని భావము కాదు. విద్యావిహీనుని బశువందురు "విద్యావిహీనః పశుః" అట్లే దోష కృత్యములను సేయుటచేత బ్రాహ్మణుడు శూద్రుడగునని కూడ చెప్పబడినది. " క్రియాహీనః శూద్రో భవతి " వాస్తవార్థమేమనగా మనుజుడు పశువు కానేరనట్లే బ్రాహ్మణాదులు శూద్రాది జాతులలోనికి మారజాలరు. కర్మణా వర్ణవ్యవస్థ పూర్తిగ నసంగతము. బుద్ధిమంతుడెవ్వడు నంగీకరింపడు. కర్మణా వర్ణవ్యవస్థయందైన కొలది నియమము లున్నవి. కాని హిందూకోడులో వర్ణవ్యవస్థనే దీసివైచి నారు. సంకరసృష్టికి బ్రయత్నము నొనర్చుచున్నారు.

అనులోమవివాహమును గూడ మనువు నిషేధించి నాడు. శూద్రస్త్రీని బెండ్లాడుటచే బతితుడగును. "శూద్రా వేదీ పతతి" శయ్యమీద శూద్రస్త్రీని బరుండబెట్టుటచే బ్రాహ్మణున కధోగతి సంభవించును, పుత్రుడు గలిగినచో బ్రాహ్మణత్వమే పోవును.

"శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిమ్
జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణాదేవ హీయతే"
[మను. 3-17]

బ్రాహ్మణాదులకు శూద్రాది వివాహ మెంతయు హానికరము. ప్రతిలోమవివాహ మంతకంటెను నిందనీయ విషయము. క్షత్రియునివలన బ్రాహ్మణ కన్యకు గలిగిన సంతతి సూతులనబడుదురు. వైశ్యునివలన క్షత్రియకన్యకు గలిగిన సంతతి మాగధసంతతి యనియు, విప్రకన్యకు గలిగిన సంతతి వైదేహసంతతి యనియు జెప్పబడెను. శూద్రుని వలన విప్రకన్యకు గలిగిన సంతతి చండాలసంతతి యగును.

"క్షత్రియా ద్విప్రకన్యాయాం సూతాభవతి జాతితః
వైశ్యాన్మాగధ వైదేహౌ రాజవిప్రాంగనాసుతౌ
శూద్రాదాయోగవః క్షత్తా చాండాలశ్చాధమో నృణామ్
వైశ్యరాజన్యవిప్రాసు జాయంతే వర్ణసంకరాః మను.[10-11,12]"
వ్యభిచారేణ వర్ణానామవేద్యా వేదనేనచ
స్వకర్మణాం చ త్యాగేన జాయంతే వర్ణసంకరాః" [మను. 10-24]

కౌటిల్యుడు కూడ నిది చాల యనర్థకారి యని చెప్పినాడు. శూద్రునకు శూద్రవర్ణస్త్రీయే భార్య కాగలదు.

"శూద్రస్యతు సవర్ణైవనాన్యా భార్యా విధీయతే"

శాస్త్రములు గూడ హిందూకోడు ధర్మసమ్మతమైనదని చెప్పుచున్నారంటే యెంతయో యాశ్చర్యముగ నున్నది!

అసవర్ణవివాహము, సగోత్రవివాహము శాస్త్రము లందు నిషేధింపబడినవి.

"అసపిణ్డా చ యా మాతు రసగోత్రా చ యా పితుః"
(విష్ణుస్మృతి)

"న సగోత్రాం న సమానార్షప్రవరాం భార్యాం విన్దేత।
మాతృతశ్చాపఞ్చమాత్, పితృతశ్చాసప్తమాత్" (29-9-16)

"సగోత్రాయ దుహితరం న ప్రయచ్ఛేత" (ఆప. ధ. సూ. 2-11)

స్మృత్యర్థసారమందు సగోత్రకన్యా వివాహమునకు ప్రాయశ్చిత్తము విధించబడినది. ఎవడైన నెరిగియుండియు సగోత్రకన్యను పరిణయమాడి గమనము చేసినచో గురుతల్ప వ్రతము నవలంబించుటచే బరిశుద్ధుడు కాగలడు. కలిగిన సంతతి చండాలసంతతి యగును. అయినను ఆస్త్రీని భోగించకుండ తల్లితండ్రులవలె పాలించవలయును. అజ్ఞానవశమున నయినచో 3 చాంద్రాయణ వ్రతములు సేయవలయును.

"ఇత్థం సగోత్రసంబంధే వివాహే స్థితే యది। యశ్చజ్ఞానతస్త్రీం కన్యామూఢ్వోపగచ్ఛతి, గురుతల్పవ్రతా చ్ఛుద్ధ్యేత్। గర్భస్తజ్జో చ ఽస్త్రీం వ్రజేత్, భోగతస్తాం పరిత్యజ్య। పాలయేజ్జననీమివ అజ్ఞానాద్యైస్తు శుద్ధ్యేత్త్రిభిర్గర్భైమ్మ కశ్యపః॥"

సపిండా వివాహమునకు ప్రాణత్యాగమే ప్రాయశ్చిత్తము.

"సపిండావత్యదారేషు ప్రాణత్యాగో విధీయతే" [బృహద్యమ]

సపిండస్త్రీతోడ గాని, సగోత్ర స్త్రీతోడ గాని యజ్ఞాన వశమున పెండ్లియైనచో నామెను తల్లివలె భావించవలెను.

"సపిండాం సగోత్రాం చేద మత్యోపయచ్ఛేన్మాతృవదేనాం బిభృయాత్"
(బౌధాయన)

" అసపిండా చ యా మాతు రసగోత్రా చ యా పితుః "

ఈ మనువచనమును బట్టి తల్లికి అసపిండురాలును, తండ్రికి అసగోత్రురాలునగు గన్యను బెండ్లాడవలయునని స్ఫుటమగుచున్నది. అన్యయుగములందు అసవర్ణ వివాహము చర్చింపబడినను కలికాలమందు మాత్రము నిషేధింపబడినది.

ఇట్లే —

" పఞ్చమాత్సప్తమాదూర్ధ్వం మాతృతః పితృతస్తథా "

ఇత్యాది స్మృతులు మాతృకులమందు 5 తరములును, పితృకులమందు 7 తరములును సపిండములని దెల్పుచుండగా కోడుబిల్లు 3 తరముల వరకే సపిండత నంగీకరించుచున్నదన యేమి బాగుగ నున్నది ?

" పంచమే సప్తమేచైవ యేషాం వైవాహికీ క్రియా
క్రియాపరా అపిహితే పతితా శ్శూద్రతాం గతాః "

ఇది యపరార్కమందు మరీచి చెప్పిన వచనము. దీనిని బట్టి 5, 7 తరముల మధ్య వివాహము చేయువారు పతితు లగుదురని వ్యక్తమైనది.

" పంచమాత్సప్తమాద్ధీనాం యః కన్యా ముద్వహేద్విజః
గురుతల్పీ స విజ్ఞేయఃసగోత్రాంచైవ ముద్వహన్ "

దీనియొక్క యభిప్రాయము కూడ నదియే.

" తృతీయాం వా చతుర్థీం వా పక్షయోరుభయోరపి
వివాహయేన్మనుః ప్రాహ పారాశర్యోంగిరా యమః "

ఈ వచనమును బట్టి తృతీయ, చతుర్థములందు కూడ వివాహము విధించబడినది. కాని యది సంగతము కాదు. ఏలయన పూర్వోక్త వచనములకు విరుద్ధముగా నుండుటచేత దాని భావమును దత్తుని సంబంధమునను, సవతి సోదరుని సంబంధనను లేదా క్షత్రియాదుల సపిండగణ మాత్రయు గ్రహించుకొనవలయును. ఇట్లు ' మానవ పారిజాతమును ' బట్టి నిర్ణయ సింధుకారులు నిర్ణయించినారు.

శాస్త్రవిశ్వాస మనునంటిన తోడనే తండ్రి యాస్తిలో నాడుబిడ్డకు భాగము లభించుట కారణముగా సోదరితోడ సోదరునకు వివాహము ఎట్టులైన జర్చలోనికి వచ్చినదును. ఒక కోటీశ్వరుడగు సోదరుడు తన సోదరిని 50 లక్షలను ఒరుల కీయనెంచునా? రెండు వస్తువులను తన యింటనే యేల నుంచుకొన కూడదు! సగోత్రవివాహము, అసవర్ణ వివాహము, సపిండవివాహములు జరుగుటలేదా? అక్క చెల్లెలును మాత్రమేల పెండ్లాడకూడదు? ఇట్టి వంటి విచారములు వచ్చుటతోడనే యందఱు నన్నచెల్లెండ్ర వివాహమును గూడ గోరుకొందురు.

ఒక్కొక్క మహాశయుడు సివిలు వివాహమును గూడ సిద్ధాంతీకరింప నెంచుచున్నాడు. కాని డాక్టరు అంబేద్కరుగారు రిజిష్టరు వివాహమునకు సపిండత్వము తోడ నిమిత్తము లేదని యంగీకరించుచున్నారు. అనగా 5, 7 తరముల విషయ మెట్లున్నను, 3, 5 తరములలోపల గూడ స్త్రీ పురుషులకు వివాహములు జరుగ వచ్చునన్నమాట.

దాక్షిణాత్యులకు ఆచారముగ వచ్చు మాతుల కన్యోద్వాహము (మేనమామ కూతురును పెండ్లి చేసుకొనుట) దేశ విశేషమం దపవాదమే. అంత మాత్రమున సార్వజనిక నియమములకు భంగము కలుగదు.

రిజిష్టరు వివాహమందు ఒకే గోత్ర ప్రవగలు కల వధూవరులకే వివాహము జరుగగలదని డాక్టరు అంబేద్కరు స్పష్టీకరించి వ్రాసియున్నారు.

☞ :— త్వరలో ద్వితీయ భాగము రాగలదు.

# సాధనగ్రంథమండలి, తెనాలి

స్థాపితము 1945.

## మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ జడ్డు లింగయ్యగారు | బందరు |
| ,, ఈదర వేంకట్రావుపంతులుగారు | ఏలూరు |
| ,, దరిసి జానకిరామయ్యగారు | కొత్తసాంబం (దరిశి తా॥) |
| ,, [illegible]గిరాల వీరాస్వామి నాయుడుగారు | కాకినాడ |
| ,, యేజెళ్ల శ్రీరాములుగారు | తెనాలి |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ గూపాకుల శివరాంగారు | హార్పిస్ |
| ,, పాలుట్ల పాలంకయ్యగారు | గుంటూరు |
| ,, దోనేపూడి వేంకటరమణమూర్తిగారు | కంభం |
| ,, వేజళ్ల రాఘవయ్య చౌదరిగారు | జూపూడి |
| ,, కలగర నాగభూషణ చౌదరిగారు | ఏలూరు |
| ,, యస్. కె. ప్రకాశరావుగారు | తెనాలి |
| ,, స్థానం నరసింహారావుగారు | ,, |
| ,, పులిపాటి వేంకటేశ్వర్లుగారు | ,, |
| ,, బొంతా సత్యనారాయణ సోదరులు | ,, |
| ,, జొన్నాదుల రామస్వామిగారు | ,, |
| ,, జయంతి బుచ్చిరామశర్మగారు | ముక్త్యేశ్వరం |
| ,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | చావలి |
| ,, దొడ్ల వెంకటరామిరెడ్డిగారు | కావలి |

## పోషకులు - తెనాలి

శ్రీ నేతి హరినారాయణరావు గారు

శ్రీ త్రిపురమల్లు శ్రీరాములుగారు తెనాలి
,, ఘట్టి జగన్నాథం గారు
,, సంకా వీరభద్రయ్య గారు
,, మగ్గిరాల సూర్యనారాయణమూర్తి గారు
,, పులిపాటి లక్ష్మీనారాయణ గారు
,, దేవభక్తుని రత్నయ్య గారు
,, వరిమి వెంకట సుబ్బారావు గారు
,, గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి గారు
,, తాడేపల్లి హరినారాయణ గారు
,, ప్రయాగ కృష్ణమూర్తి గారు
,, చుండూరు రామయ్య గారు
,, వినపాముల శేషా రామయ్య గారు. గుంటూరు
,, పోలిశెట్టి సోమసుందరం గారు ,,
,, బెండపూడి పేర్రాజు గారు హాత్రేరు
,, చీమలపాటి గణేశ్వరరావు పంతులుగారు ,,
,, స్వామ్య మృతానందతీర్థ, కలగ ఆంజనేయ శాస్త్రిగారు
విజయవాడ.
,, సి. అలవందరయ్య గారు మద్రాసు.

సభ్యులు _ తెనాలి

శ్రీ కోటంరాజు కృష్ణారావు గారు
,, ఖండ్రిక సాంబయ్య గారు.
,, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు
,, వెంపటి సూర్యనారాయణ గారు
,, ముక్కామల వేంకటాచలపతిరావు గారు
,, కోగంటి తిరుపతయ్య గారు

శ్రీ గాడేపల్లి వేంకట సుబ్బారావు గారు
,, మట్టిగుంట వీరభద్రరావు గారు
,, తిరిపురవు శ్రీరాములుగారు
,, ప్రత్తి సూర్యనారాయణగారు
,, అన్నంరాజు మాధవరావుగారు
,, పూదిరాజు రామదాసుగారు
,, ముదిగొండ మృత్యుంజయుడుగారు
,, ధారా సీతారామకృష్ణయ్యగారు
,, రాజా వేంకటజగన్నాధరావు
,, ఆలూరు సుందరరావుగారు
,, గుడివాడ హనుమంతరావుగారు
,, గోనుగుంట్ల సుబ్బారావుగారు
,, వడ్లమాని రామశాస్త్రిగారు
,, వినపాముల నారాయణగారు
,, రాజ వేంకటనరసింహారావుగారు
,, అద్దేపల్లి శ్రీమన్నారాయణమూర్తిగారు
,, అక్కుల వేంకటేశ్వర్లుగారు
,, రావినూతల నరసింహారావుగారు
,, ఉదర సుందరామయ్యగారు
,, ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు
,, జెండపూడి కృష్ణారావుగారు
,, దార్వేముల వేంకటేశ్వరశాస్త్రిగారు
,, అల్లాడ వీరరాఘవస్వామిగారు
,, పొప్రైటర్సు రూబియింకు
,, పొప్రైటర్సు సారధిప్రెస్

| | |
|---|---|
| శ్రీ తూములూరు శ్రీరామమూర్తిగారు | పినపాడు |
| ,, వుచ్చా వెంకటకృష్ణమూర్తిగారు | దంతలూరు |
| ,, వల్లూరు వేంకటేశ్వర్లుగారు | బాపట్ల |
| ,, మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు | తిరుచునాపల్లి |
| ,, యం. లింగమూర్తిగారు | మదరాసు |
| ,, ఆర్. సాంబశివరావు | ,, |
| ,, పిసిపాటి పిచ్చయ్యగారు | ఇంకొల్లు |
| ,, ఈదర సూరయ్యగారు | అయితానగరం |
| ,, ఇసుకపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు | గార్లపాడు |
| ,, వన్నాల లక్ష్మీనరసింహంగారు | గుంటూరు |
| ,, పన్నాల రామకృష్ణయ్యగారు | ,, |
| ,, జొన్నలగడ్డ వేంకటసుబ్రహ్మణ్యంగారు | ,, |
| ,, గరిమెళ్ల వెంకటరమణకామేశ్వరరావుగారు | గంగలకుర్రు |
| ,, దువ్వూరి వెంకటపతిసోమయాజులు జమీందారుగారు | ,, |
| ,, గరిమెళ్ళ శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, గొర్తి పళ్లయ్యపంతులుగారు (అగ్రహారం) | ,, |
| ,, గవిని శాయన్నగారు | జంపని |
| ,, రాళ్ళభండి వెంకటసీతారామశాస్త్రిగారు | బందరు |
| ,, మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు | అయినవిల్లి |
| ,, సంబూరి సుబ్బరాజుగారు | ,, |
| ,, విళ్ళ వెంకటస్వామిగారు | ,, |
| ,, మద్దిరాల వేంకటకామేశ్వరరావుగారు | శానపల్లిలంక |
| ,, సమయమంతుల నాగేశ్వరరావుగారు | ర్యాలి |
| ,, అల్లవరపు అన్నప్పగారు | ముక్తేశ్వరం |
| ,, సలాది బాపయ్యగారు | అనాతవరం |

| | |
|---|---|
| శ్రీ పరిపల్లె విశ్వనాథంగారు | అనాతవరం |
| ,, గొర్తి వెంకటనృసింహశాస్త్రిగారు | ఇందుపల్లి |
| ,, బులుసు పాపయ్యశాస్త్రిగారు | రాజమండ్రి |
| ,, బులుసు సత్యనారాయణగారు | ,, |
| ,, భగజ్ఞలాల్ జోల్నల్‌గారు, బ్యాంకర్సు | ,, |
| ,, చింతలూరి రామారావుగారు | ,, |
| ,, ద్వారకదాస్ గిరిధరదాస్‌గారు | ,, |
| ,, మిత్తింటి నరసింహంగారు | ,, |
| ,, మానాప్రగడ శ్రీరాములుగారు | కొవ్వూరు |
| ,, నందూరి రాఘవరాజుగారు | ,, |
| ,, శ్రీపాద రామయ్యగారు | కాకినాడ |
| ,, బులుసు వేంకటేశ్వర్లుగారు | ,, |
| ,, చెరువు శివరామకృష్ణశాస్త్రిగారు | విజయవాడ |
| ,, కాజ సూర్యనారాయణగారు | ,, |
| ,, నోరి రామశాస్త్రిగారు | ,, |
| ,, నందిపాటి రామయ్యగారు | ,, |
| ,, కాంచనపల్లి కనకాంబగారు | ,, |
| ,, జిల్లెళ్ల వెంకటభానోజీరామర్సుగారు | పేరూరు |
| ,, మంధా సుబ్బారావుగారు | అమలాపురం |
| ,, అప్పద్వేదుల సీతారామయ్యగారు | ,, |
| ,, కోట పాలయ్యగారు | ,, |
| ,, గూడా సత్యహరిశ్చంద్రుడుగారు | ,, |
| ,, మంగళపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు | |
| ,, యం. వేంకటసుబ్బారావుగారు | ,, |
| ,, వనం వేంకటేశ్వరరావుగారు | ఖమ్మంమెట్టు |

| | |
|---|---|
| శ్రీ కె. జగన్మోహనరావుగారు | నేలకొండపల్లి |
| ,, జి. లోకనాథశర్మగారు | ,, |
| ,, యస్. పి. విశ్వనాథశర్మగారు | సికింద్రాబాదు |
| ,, జమ్మలమడక సూర్యప్రకాశరావుగారు | ,, |
| ,, ముదిగొండ రాజయ్యగారు | ,, |
| ,, అనులము రాఘవశర్మగారు | ,, |
| ,, చిల్లా సుబ్బరాయసిద్ధాంతిగారు | ,, |
| ,, గోర్తి రామమూర్తిగారు | ,, |
| ,, చిఫుకుల అప్పయ్యశాస్త్రిగారు | ,, |
| ,, తాడేపల్లి శివరామకృష్ణయ్యగారు | ,, |
| ,, నారాయణం విశ్వనాథంఅండ్ బ్రదర్సువారు | విజయనగరం |
| ,, కె. యస్. యస్. పట్నాయక్ గారు | ,, |
| ,, జోస్యుల వెంకటసత్యనారాయణమూర్తిగారు | భట్నవిల్లి |
| ,, గోర్తి వల్లయ్యశర్మగారు | నేదునూరు |
| ,, వడింపల్లి సత్యనారాయణరాజుగారు | అంబాజీపేట |
| ,, నూకల అమ్మన్నపంతులుగారు | నందంపూడి |
| ,, వడ్లమాని కామేశ్వరరావుగారు | ,, |
| ,, నూకల లక్ష్మీనారాయణగారు | ,, |
| ,, గంటి సుబ్బారావుగారు | ,, |
| ,, చల్లా సుబ్రహ్మణ్యంగారు | నరేంద్రపురం |
| ,, సూరిశెట్టి వెంకటస్వామినాయుడుగారు | మగటపల్లి |
| ,, దివ్యభాష్యం వెంకటసూర్యనారాయణగారు | చింతలూరు |